Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు  స్థాపితం: 1930  జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*




సంపుటి: 82 • సంచిక: 2 • 14-1-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



### రోజుకొకసారి చచ్చి బ్రతుకుతున్న కిరణ్ సర్కార్...

# దినదిన గండం... రెండు నెలల ఆయుష్షు!

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి పరిస్థితి చూసి అయ్యోపాపం అనని వాడు లేడు. శత్రువుకు కూడా ఈ శిక్ష వద్దనేట్లు వుంది ఆయన అధికార వైభవం. రాష్ట్ర చరిత్రలో ఎప్పుడూ లేనంత రాజకీయ అయోమయం, సంక్షోభం ముఖ్యమంత్రిని తికమక పెడుతున్నాయి. గద్దె ఎక్కిన నాటి నుంచి ఒక్కరాత్రి కూడా కంటి నిండా కునుకు లేదాయనకు. పైగా పగటి పూటే పీడకలలు. ఒకపక్క జగన్ చీకాకు, మరొకపక్క తెలంగాణ ఉద్యమ సెగలు పొగలు, వేరొకప్రక్క కృష్ణ నీళ్ల పంపకం గొడవ, మధ్య మధ్యలో ఎమ్మెల్యేల బెదరింపులు... ఈ సమస్యలతో తల బట్ట కట్టి పోతున్నది ముఖ్యమంత్రికి.

## తుమ్మితే వూడే ముక్కు

ప్రభుత్వం పరిస్థితి చూస్తే తుమ్మితే వూడే ముక్కు చందంగా వుంది. వైఎస్. జగన్ ఢిల్లీ దీక్షకు ఎమ్మెల్యేలు వెళ్లకుండా చేయడానికి కిరణ్‌కుమార్ రెడ్డి చేయని ప్రయత్నం లేదు. జగన్ అనుకూల ఎమ్మెల్యేల కాళ్లు గడ్డాలు పట్టుకొని బ్రతిమలాడాడాయన. ఎన్నెన్నో తాయిలాలు ఆశ చూపించాడు. కానీ వారెవ్వరూ మాట వినలేదు. మామూలుగా అయితే మాట వినకుండా, పార్టీని ధిక్కరించి పోయిన ఎమ్మెల్యేలను పార్టీ నుంచి సస్పెండ్ చేయాలి. కానీ, ఆ పని చేస్తే తన ప్రభుత్వం పతనమై పోతుంది. అందుకు కారణం – శాసనసభలో కాంగ్రెస్ సంఖ్య కేవలం 156. మెజార్టీ సంఖ్య 147. ఎనిమిది మంది పక్కకు తప్పుకొంటే, తన సర్కారు మైనర్ తీరక ముందే మైనార్టీలో పడిపోతుంది. ఆ ప్రమాదం తప్పించుకోవాలంటే, ఎమ్మెల్యేల ధిక్కారాన్ని చూసీ చూడనట్లు వదిలి వేయాలి.

## అధికారులకు చులకన

ప్రభుత్వానికి తగిన బలం లేదని స్పష్టంగా అర్థమై పోవడంతో అధికారులకు చులకనై పోతున్నది. ఒక్కరూ ముఖ్యమంత్రి మాట వినడం లేదు. అడిగిన ఫైళ్లు పంపడం లేదు. ఉత్తర్వులు బేఖాతరు చేస్తున్నారు. రాష్ట్రంలో ప్రభుత్వం అనేది వుందా లేదా అన్న సందేహం కలిగే రీతిలో వుంది పరిస్థితి. పోనీ పార్టీలో మిగిలిన ఎమ్మెల్యేలైనా సహకారం అందిస్తున్నారా అంటే, అదీ లేదు. వారు కోరే గొంతెమ్మ కోరికలు తీర్చడం కిరణ్ చేత కావడం లేదు. ఇటువంటి రాజకీయ సంక్షోభ సమయాలలో ఏ ముఖ్యమంత్రి అయినా ఎమ్మెల్యేలను నెత్తిన పెట్టుకొని వూరేగుతారు. వారు కొండ మీద కోతిని తెచ్చి ఇవ్వమంటే తెచ్చిస్తారు. అయితే కిరణ్‌కు ఆ సామర్థ్యం లేదు. సిఎం పేషీలో నియమించు కొన్న అధికారులు అందుకు పనికి రావడం లేదు. వారికి ఏ మాత్రం లౌక్యం తెలియడం లేదు. తమ దగ్గరకు వచ్చే ఎమ్మెల్యేలకు రూల్ బుక్ చదివి భాష్యం చెప్తున్నారు వారు. దానితో ఎమ్మెల్యేలకు కోపం నషాలానికి అంటుతున్నది.

## నివురుకప్పిన నిప్పు

మరొకప్రక్క తెలంగాణ ఉద్యమం నివురు కప్పిన నిప్పు వలె వుంది. తెలంగాణ తెచ్చిన ఘనత తమకే దక్కాలని కె.కేశవరావు వంటి ఎమ్పీలు చేస్తున్న రాజకీయ కొంటె చేష్టలు ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెడుతున్నాయి. వారిని అదుపు చేయడం కిరణ్‌కు అలివి కావడం లేదు. దానితో ప్రణబ్ ముఖర్జీ వంటివారు తమ పనులన్నీ మానుకొని ఆంధ్ర ఎమ్పీలను బుజ్జగించే పనికి ప్రాధాన్యత ఇవ్వాల్సి వస్తున్నది. సమస్యలన్నీ తమ మీదకు తోసేస్తున్నాడని ముఖ్యమంత్రి మీద చికాకు పడుతున్నారు ఢిల్లీ పెద్దలు.

## అక్కడా బలహీనతే

రాష్ట్రంలో ఎమ్మెల్యేల మీద చర్య తీసుకొంటే కిరణ్ ప్రభుత్వానికి ఎంత ముప్పు వుందో, ఎమ్పీల మీద కొరడా ఝుళిపిస్తే మన్మోహన్‌సింగ్ ప్రభుత్వానికీ అంతే ప్రమాదం పొంచి వుంది. తెలంగాణ ఇస్తే ఆంధ్రకు చెందిన ఇరవై మంది ఎమ్పీలు రాజీనామా అస్త్రం ప్రయోగిస్తారన్నది భయం. అంత మంది రాజీనామా

కొరవ 14వ పేజీలో





## పటేల్ అయితే ఎస్... ప్రణబ్ అయితే నో...

అటు జగన్, ఇటు తెలంగాణ విషయాలలో కాంగ్రెస్ అధిష్టానం ప్రణబ్ ముఖర్జీ, అహ్మద్ పటేల్‌లను మాత్రమే దూతలుగా వాడుతున్నది. అయితే ఇద్దరి మధ్య ఒక ప్రధానమైన తేడా వుంది. ఏ సమస్య మీద అయినా చర్చించడానికి ప్రణబ్ ముఖర్జీ నుంచి పిలుపు వచ్చిందంటే అర్థం – దానికి కాంగ్రెస్ అధిష్టానం "నో" అని చెప్పబోతున్నదని. అదే అహ్మద్ పటేల్ నుంచి పిలుపు వస్తే మాత్రం – "ఎస్" అని చెప్పబోతున్నారని భావం. తెలంగాణ విషయంలో ప్రణబ్ ముఖర్జీ కాంగ్రెస్ ఎమ్పీలతో పదే పదే సమావేశాలు నిర్వహిస్తున్నాడు. బుజ్జగింపులు, బెదరింపులతో వారిని దారికి తెస్తున్నాడు. ఆయన అన్నిసార్లు తెలంగాణా మీద సమావేశాలు నిర్వ

కొరవ 14వ పేజీలో

# ఇప్పుడేమంటారు?

అనంతపురం జిల్లా ఓబుళాపురం ఇనుప ఖనిజం గనులలో గాలి జనార్దనరెడ్డి సోదరులు తీవ్రమైన ఖనిజ దోపిడీకి పాల్పడినట్లు సుప్రీంకోర్టు సాధికారిక సమితి నిర్ధారించింది. ఆ కుటుంబం యాజమాన్యంలోని గనులన్నిటిలో అక్రమాలు జరిగినట్లు తేల్చి చెప్పింది. తమ గనులను విస్తరించుకోవడానికి రాష్ట్ర సరిహద్దు రాళ్లను చెరిపి వేశారని, అటవీ భూములలో కూడా అక్రమంగా త్రవ్వకాలు జరిపారని, కొన్ని వేల కోట్ల రూపాయల ఖనిజ సంపదను కొల్లగొట్టారని సర్వోన్నత న్యాయస్థానానికి నివేదించింది. ఈ తప్పులకు వారి నుంచి భారీ మొత్తంలో పరిహారం వసూలు చేయాలని కూడా సిఫార్సు చేసింది.

గత నాలుగైదేళ్లుగా ఇటు ఆంధ్ర, అటు కర్నాటక, రాష్ట్రాలలో ప్రతిపక్షాలు, పత్రికలు ఓబుళాపురం గనుల అక్రమాలపై ఆందోళన చేస్తున్నాయి. అక్కడ జరుగుతున్న ప్రకృతి సంపద దోపిడీని అరికట్టాలని లెక్కలేనన్నిసార్లు అలజడి సృష్టించాయి. కానీ ఇక్కడ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ప్రభుత్వం, అక్కడ బిజెపి సర్కారు కూడా వాటిని పట్టించుకోలేదు. గాలి సోదరులు తప్పేమీ చేయలేదని శాసన సభలోనే ప్రతిపక్షాలను గద్దించారు. ఆ గనులలో ఏమి జరుగుతున్నదీ లోకానికి తెలియకుండా కాపాడారు. కొన్ని సంవత్సరాలపాటు గాలి సోదరులు యదేచ్ఛగా ఇనుప ఖనిజం త్రవ్వుకొని, వేల కోట్ల అక్రమార్జన చేసుకొనేందుకు నిస్సిగ్గుగా సహకరించారు. ఉభయ రాష్ట్రాలలోని ప్రభుత్వాలు తమ కాలి క్రింద చెప్పుతో సమానమని అర్థం చేసుకొన్న గాలి జనార్దనరెడ్డి, తమ గనులపై విమర్శలు చేసే ప్రతిపక్ష నాయకుల మీద, పత్రికల మీద ఎంతగా నోరు పారేసుకొన్నదీ అందరికీ తెలుసు. చంద్రబాబు వంటి జాతీయస్థాయి నేతను సైతం గాలి జనార్దనరెడ్డి అసభ్యంగా తిట్టాడు. శాపనార్థాలు పెట్టాడు. కాళ్లక్రింద వేసి నలిపి వేస్తానని బెదరించాడు.

కానీ నిజం నిప్పులాంటిది. ఎంతోకాలం దాన్ని చేతులతో కప్పెట్టి, దాచి పెట్టడం జరగని పని. ఎక్కడో ఒక దగ్గర పాపం పండక తప్పదు. సుప్రీంకోర్టు విచారణ ద్వారా ఆ కార్యం నెరవేరింది ఇప్పుడు. తమను ఆశ్రయించి వుండే పెట్టుబడిదారులు, పారిశ్రామికవేత్తలకు ప్రజల సంపదను దోచి పెట్టడంలో ప్రభుత్వాలు ఎంత బరితెగింపుగా వ్యవహారం చేస్తాయో అర్థం చేసుకోవడానికి ఇదొక చిన్న ఉదాహరణ మాత్రమే. లక్షా డెబ్బై వేల కోట్ల రూపాయల 2జి స్పెక్ట్రం కుంభకోణం విషయంలో కూడా కేంద్ర ప్రభుత్వం అదే తీరులో వ్యవహరిస్తున్నది. కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ నివేదికలో పేర్కొన్నట్లు ఈ వ్యవహారంలో లక్షా డెబ్బై వేల కోట్ల రూపాయల గోల్మాల్ ఏదీ జరగలేదని, ఆ మాటకొస్తే ఒక్క పైసా కూడా నష్టం జరగలేదని నిస్సిగ్గుగా ప్రకటన చేశాడు కేంద్ర టెలికాం శాఖ మంత్రి కపిల్ సిబాల్. ఈ కుంభ కోణానికి కారకులైన రాజకీయవాదులు, అధికారులను రక్షించడానికి కేంద్ర ప్రభుత్వం చేస్తున్న కుటిల ప్రయత్నంలో భాగంగానే ఆయన ప్రకటన చేశాడని భావించాలి. ఆనాడు గాలి సోదరుల కోసం వైఎస్.రాజశేఖర్‌రెడ్డి చేసిన తప్పునే మన్మోహన్‌సింగ్ చేస్తున్నాడు.

జమీన్‌రైతు

అవినీతి విషయంలో రాజకీయవాదులు ఇంత కుత్సితంగా నడచుకోవడం శోచనీయం. ఓబుళాపురం అక్రమాలు వెలుగులోకి వచ్చిన రోజే ఆనాటి ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి నిజాయితీగా దర్యాప్తుకు సహకరించి వుంటే, కొన్నివేల కోట్ల ప్రజల ధనం రక్షింపబడి వుండేది. ఆ అక్రమాలను నివారించడం మాని దుర్బుద్ధితో గాలి సోదరులకు అదనపు గనులు కేటాయించారు. ఒక్క వ్యక్తి ప్రయోజనం కోసం మొత్తం రాష్ట్ర ప్రయోజనాలను పణంగా పెట్టారు.

ప్రజల ఓట్లతో ఎన్నికయ్యే పాలకులు అదే ప్రజల ఆస్తులను బందిపోట్ల పాలు చేసే దుష్ట సాంప్రదాయానికి ఎక్కడో ఒక దగ్గర ముగింపు పలకకుంటే దేశం సర్వనాశనమై పోతుంది. సుప్రీంకోర్టు విచారణ ద్వారా అయినా ఇప్పుడు నిజాలు వెలికి రావడం కొంత సంతోషం కల్గించే విషయం. ఈ విషయంలో సర్వోన్నత న్యాయస్థానం ఇచ్చే తీర్పు, భవిష్యత్తులో మరే పాలకుడూ అక్రమాలకు అండగా నిలవాలంటే భయపడే రీతిలో వుండాలని కోరుకొంటున్నాము.

## జనవాణి

### పథకాలు బారెడు – ఆచరణ పిడికెడు!

పథక రచనలో మనం బహు మొనగాళ్లం. కానీ ఆచరణలో మాత్రం పెద్ద అభాసురాయుళ్లం. ఆహార భద్రత, విద్యాహక్కు, ఉపాధి కల్పన, గృహ వసతి వగైరా వంటి కొంగ్రొత్త ఆశల గాలిపటాలను కేంద్ర ప్రభుత్వం ఇటీవల దేశం మీదికి విసిరింది. దేశాన్ని పారదర్శకంగా పాలించడం, ప్రజలకు జవాబుదారీగా వుండడం నేతల బాధ్యతగా మన రాజ్యాంగం నిర్దేశించింది. కానీ సంక్షేమ పథకాల ఆవిష్కరణలో పాలకుల సంకల్పబలం, అధికారుల్లో నిజాయితీ లోపించడం మనకు ఎదురైన గతానుభవం. అన్నింటినీ మించి వ్యవస్థీకృతమైన అవినీతి మన పథకాల ఆచరణకు గొడ్డలిపెట్టన్నది జగమెరిగిన సత్యం. మరో వైపు నియంత్రణ లేకుండా ఆర్థిక సంస్కరణలు అమలు జరుగుతున్న తీరు వివాదాస్పదమౌతున్నది. సంస్కరణల మూలంగా బూటకపు అభివృద్ధి రేటు తొమ్మిది శాతానికి ఎగబాకుతున్నా ద్రవ్యోల్బణంతో నిత్యావసర ధరలు నింగిని తాకుతూ సామాన్యుల బతుకులు భారం కావడంతో సంక్షేమ ఫలితాలు లక్షిత వర్గాలకు బహు దూరంగానే నిల్చిపోతున్నాయి.

ఎం.రామమూర్తి — విశాఖపట్నం

### విద్యార్థులకు శిక్ష!

కోవూరు మండలం చిన్నపదుగుపాడులో వున్న విజ్ఞాన్ ఇంగ్లీషు మీడియం హైస్కూల్‌లో డిశంబర్ 15వ తేది నుంచి 23వ తేది వరకు అర్ధ సంవత్సరం పరీక్షలు నిర్వహించారు. 24, 25, 26 తేదీలు సెలవు దినాలుగా ప్రకటించారు. 27వ తేదీ స్కూల్ పునః ప్రారంభింపబడింది. విద్యార్థులకు అర్ధ సంవత్సరం పరీక్షలలో వచ్చిన ఫలితాలను వెల్లడించారు. అంతవరకు బాగానే వుంది. కానీ జనవరి 3వ తేది నుంచి 8వ తేది వరకు మళ్లీ అర్ధ సంవత్సరం పరీక్షలు జరుగుతాయని టైమ్ టేబుల్ విడుదల చేశారు. ప్రశ్నాపత్రాల తయారీ ఖర్చు పేరుతో గతంలోలా మళ్లీ 250 రూపాయలు వసూలు చేస్తున్నారు. జిల్లాలో ఎక్కడాలేని విధంగా 18 రోజుల వ్యవధిలో రెండు పర్యాయములు అర్ధ సంవత్సరం పరీక్షలు నిర్వహించడం వెనుక ఆంతర్యం ఏమిటో తెలియడం లేదు.

జి.దశరధరామయ్య — చిన్నపదుగుపాడు

### నెల్లూరుకు నష్టం జరిగేటట్లుంది!

రాష్ట్ర విభజన అంశంపై కేంద్ర ప్రభుత్వం నియమించిన శ్రీకృష్ణ కమిటీ తన నివేదికను సమర్పించింది. ఈ నివేదిక గందరగోళంగా వుంది. కమిటీ చేసిన వివిధ సూచనల్లో నెల్లూరుజిల్లా పరిస్థితి ఏమిటో అర్థం కావడం లేదు.

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

16-1-1941
పేజీలు : 12 వెల: అణా

### డాక్టర్ మూర్తి గారికి రూ.50 జుల్మానా!

సెక్షన్ 417 ఐపిసి ప్రకారము గుంటూరు స్పేషనరీ సబ్‌మేజిస్ట్రేటు గారు 3-1-1941 తేదీన డాక్టర్ ఎం.ఎస్. మూర్తి, ట్రంకురోడ్డు, నెల్లూరు గారికి రూ.150లు జరిమానా లేకుంటే 6 వారాలు కఠిన శిక్ష విధించారు. కేసు వివరం : తే 15-4-40న ఏషియన్ ఇన్సూరెన్స్ కంపెనీ వారు ఆర్గనైజర్ హోదాలో రూ.40లు ప్రీమియర్ బ్యాంకు నెల్లూరుకు చెక్కు వ్రాసి సోమవరపు వెంకటరెడ్డి(పోతిరెడ్డిపాళెం) గారికి మూర్తి గారిచ్చారు. బ్యాంకులో పైకం మూర్తి గారు డిపాజిట్ చేయనందున రెండు మార్లు చెక్కు తిరగ్గొట్టబడింది. బ్యాంకులో డబ్బు వున్నదని చెప్పి వెంకటరెడ్డి గారి చేత "ప్రపోజల్స్" స్వీకరింపజేసి ఆయన్నీవిధంగా మోసం జేసినందుకు ఏషియన్ ఇన్సూరెన్స్ కంపెనీ బ్రాంచి మేనేజర్(గుంటూరు) మూర్తి గారిపై కేసు దాఖలు చేశారు.

### బద్దెపూడి వెంకటనారాయణరెడ్డి గారి విడుదల

వీరిని తిరుచునాపల్లి సెంట్రలు జైలులో 16వ తేదీన విడుదల చేసిరి. వీరికి గూడూరు సబ్ కలెక్టరుచే 18వ తేది డెట్ రిలీఫ్ బోర్డు మీటింగుకు అప్పుడే నోటీసు పంపించబడెను.

### రంధ్రాన్వేషి

ఇవన్నీ అధికారాన్ని శాస్త్రరీత్యా జరిపితే కలిగే కుక్కమూతి బిడ్డలే.

కోట ప్రాంతీయుడు ఒక ఘరానా రెడ్డి ఓటర్ల లిస్టులో స్త్రీ అని పడినాడు. ఆయన సవరణకు అర్జీ పెట్టుకొనగా అధికారి.

"మీరు స్త్రీ కాదని రుజువు చేయగలిగిన సాధనాలతో ఫలానా తేది మా ఆఫీసుకు హాజరు కావలసింది అని తాకీదు జారీచేసినాడు. రెడ్డి గారు ఏమేమి తీసుకొనిపోయినారో ఆ ఎలక్షన్ ఆఫీసరుకే తెలిసి వుంటుంది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

13-1-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఎలిజబెత్ రాణి భారత పర్యటన

బ్రిటిష్ మహారాణి ఎలిజబెత్ పతీసమేతంగా ఈ మాసంలో భారతదేశం విచ్చేస్తున్నది. ఆమె పర్యటనలో పాకిస్తాన్, నేపాల్, ఇరాన్ దేశాలు గూడా వున్నవి. ఈ పర్యటనలో అలంకరించుకొనుటకుగాను, ఆమెకున్న నగలలో కోటి పౌన్లు(షుమారు 15కోట్ల రూపాయలు)విలువజేసే నగలను తెచ్చుకొంటున్నదట. ఇక ఆమెకున్న నగలు మొత్తం విలువజూస్తే ఇంకెన్ని కోట్లకు వుంటుందో. రాజుల సొమ్ము రాళ్లపాలని సామెత వున్నది కదా!

ఆమె సంచారములో ఈ నగల రక్షణ బాధ్యత, సమర్థతకు పేరెన్నికగన్న స్కాట్‌లెండ్ యార్డ్ పోలీస్ చీఫ్ ఇన్స్‌పెక్టరు వహిస్తాడట. ఇతడే ఆమె ప్రధాన అంగరక్షకుడుగా గూడా వుంటాడు.

### సంజీవయ్య, రాజుగార్ల పర్యటన

ముఖ్యమంత్రి దామోదరం సంజీవయ్య, పబ్లిక్ వర్కు మంత్రి సత్యనారాయణరాజు గారలు ఫిబ్రవరి 13, 14, 15 తేదులలో కావలి, నెల్లూరు, ఆత్మకూరు, వాకాడు వగైరా ప్రదేశాలలో పర్యటించబోతున్నారు. నెల్లూరులో నానాదాసు గారి హరిజన, గిరిజన, క్రైస్తవ సభ. కావలిలో రైతుసభ; కనుపూరు ఫిర్కాలో ఒక సభ; ఆత్మకూరు తాలుకాలో కొండయ్య గారికి సంబంధించిన సభ; వాకాడులో బాలకృష్ణారెడ్డి గారి సన్మాన సభ వుంటాయట.

### బంగారు భూమికి బహుమతి

మన నెల్లూరీయుడు గ్రిద్దలూరు గోపాలరావు గారు గ్రామాభ్యుదయ ధ్యేయంతో రచించిన 'బంగారు భూమి' నాటిక, ఆదిలాబాదు జిల్లా సంగీత నృత్య మహోత్సవంలో ప్రథమ బహుమతి పొందడం అభినందనీయం.

# నెల్లూరు ముచ్చట్లు
## విశేషాలు

### మాంసాహారంతో మనసుదోచిన వెంకయ్య!

వెంకటాచలంలోని స్వర్ణభారత్ ట్రస్ట్‌లో 11వ తేదీ ముప్పవరపు వెంకయ్య నాయుడు జరిపించిన సంక్రాంతి సంబరాల్లో భాగంగా మధ్యాహ్నం అతిథులు, ఆహుతులకు బ్రహ్మాండమైన మాంసాహార విందు పెట్టి అందరి మనసు దోచారు. వెంకయ్యనాయుడు నేతృత్వంలో జరిగే ఏ కార్యక్రమంలో నైనా 'కోమల విలాస్' భోజనం పెట్టించడం ఆనవాయితీ. 11వ తేదీ దీనికి భిన్నంగా చికెన్ బిర్యానీ, మటన్ కుర్మా, చికెన్ ఫ్రై, కుర్మా, రొయ్యల పులుసు, కొరమేను పులుసు చివరన కిళ్లీకి బదులుగా తేగలు, రేగుపండ్లు పెట్టారు. ఈ కార్యక్రమానికి అతిథులుగా వచ్చిన సినీ నటులు చిరంజీవి, రాజేంద్రప్రసాద్, అలీ అయితే నెల్లూరు నాన్‌వెజ్ రుచి బ్రహ్మాండమంటూ సహపంక్తి భోజనం చేస్తూ చెప్పడం చర్చనీయాంశమయ్యింది.



### రైల్వే ఫుట్‌ఓవర్లకు రైలింగ్ లేదు!

నెల్లూరు రైల్వేస్టేషన్‌లో వివిధ ప్లాట్‌ఫారాలను ప్రయాణీకులు ఇబ్బంది లేకుండా చేరుకోను ఫుట్‌ఓవర్ బ్రిడ్జిలైతే కట్టారు కానీ వీటిని పట్టుకొని ఎక్కను రైలింగ్ లేకపోవడం వల్ల కాస్త వయస్సు మళ్లినవారు నానాపాట్లు పడుతున్నారు. రైల్వే శాఖాధికారులకు ఈ సమస్యను పరిష్కరించడం చిటికెలో పని. ఆ వైపుగా కృషి చేస్తే బాగుంటుంది.

### జీబ్రా లైన్లు ఎవరు వేయించాలి?

నెల్లూరు నగరంలోని రోడ్లను దాటాలంటే జనానికి పెద్ద సాహసంగా మారింది. ట్రాఫిక్ పెరిగిపోవడం, ముఖ్యమైన కూడళ్లలో జనం రోడ్డు దాటుతున్నా వాహనాలు ఏమాత్రం ఆగక సమస్యను మరింత జటిల పరుస్తుంది. జనం ఏ మాత్రం ఇబ్బంది లేకుండా రోడ్డును దాటను ముఖ్య కూడళ్లలో జీబ్రాలైన్లు వేయించడం, ట్రాఫిక్‌ను సమన్వయ పరచే వారి విధి. ఈ పని కార్పొరేషన్ తన నిధులతో చేపట్టాలని పోలీసులు చెబుతుండగా, కమిషనర్ ఈ విషయం తమ పరిధిలోనిది కాదన్నట్లు వ్యవహరిస్తున్నాడు.



### ఎల్‌టిసిలో డిఆర్వో!

జిల్లా రెవిన్యూ అధికారి జయరామయ్య ఎల్టిసిలో భాగంగా సెలవు పెట్టగా ఆయన ట్రాన్స్‌ఫర్ అయ్యారని ఓ రెవిన్యూ వర్గం ప్రచారం లేవదీసింది. జన గణన, ఓటరు నమోదు కార్యక్రమాలను డిఆర్వో పర్యవేక్షిస్తున్న దృష్ట్యా మార్చి 31వ తేదీ వరకు ఆయన బదలీ ప్రస్తావన లేదంటున్నారు కలెక్టరేట్ వర్గాలు.

### విడవలూరు ఎమ్మార్వోపై ఒత్తిడి చేస్తున్నదెవరు?

విడవలూరు ఎమ్మార్వో, వీఆర్వోల మధ్య రగడ ఎన్‌టివి విలేకరి వరకు విస్తరించి ఆ విలేకరిపై ఎస్‌సి, ఎస్‌టి అట్రాసిటీ కేసులు దాఖలుచేసే వరకు వెళ్లిన విషయం పాఠకులకు తెలిసిందే. ఈ గందరగోళం ఒత్తిడిలో ఎమ్మార్వో ఆరోగ్యం దెబ్బతినడంతో ఆయన ఈ కేసును విత్‌డ్రా చేసుకొంటున్నానంటున్నా ఇద్దరు ముఖ్య అధికారులు ఆయన్ను ఆ పని చేయవద్దని ఒత్తిడి చేస్తున్నట్లు తెలిసింది. నెల్లూరు అధికారులకు అక్రమ కేసుల బనాయింపుపై అంత శ్రద్ధ ఎందుకో అర్థం కావడం లేదు.

### వన్‌టౌన్‌కు కొత్త ఎస్ఐ

నెల్లూరు వన్‌టౌన్ ఎస్ఐగా నరసింహారెడ్డి నియమితులయ్యారు. తోటపల్లిగూడూరు స్టేషన్ నుంచి ఇక్కడకు వచ్చారాయన. వన్‌టౌన్‌లో పనిచేస్తుండిన మంగారావుకు సిఐగా ప్రమోషన్ వచ్చింది. వన్‌టౌన్ స్టేషన్ పరిధిలో రచ్చారావిళ్లు జాస్తి. నరసింహారెడ్డి కాస్త కరకుగా పనిచేయాల్సి వస్తుంది.

### ప్రజారాజ్యానికి ప్రచారమియ్యండి!

ప్రజారాజ్యం పార్టీ చేపడుతున్న కార్యక్రమాలకు ప్రింట్ అండ్ ఎలక్ట్రానిక్ మీడియా ద్వారా తగినంత ప్రచారం రావడం లేదని ఆ పార్టీ నెల్లూరు నగర అధ్యక్షుడు ముక్కాల ద్వారకానాథ్ 9వ తేదీ జరిగిన పార్టీ కార్యకర్తల సమావేశంలో వాపోయారు. తమ పార్టీకి స్వంత టీవీ, పత్రిక లేకపోవడం వల్ల ఈ దుస్థితి దాపురించిందని బాధ పడ్డారాయన. మెగాస్టార్‌కు చెప్పి రెండూ పెట్టించండి ద్వారకానాథ్ గారు.

### అల్లూరు పోలేరమ్మ తిరునాళ్ల!

అల్లూరు గ్రామదేవత పోలేరమ్మ తిరునాళ్ల 11వ తేదీ రాత్రి ఘనంగా జరిగింది. దేవస్థానం నుంచి దరిదాపులు అల్లూరు పేటంతా విద్యుత్ దీపాలంకరణ చేశారు. అమ్మవారికి చేసిన పుష్పాలంకరణ చూడను రెండు కళ్లు చాలలేదు. ఎక్కడెక్కడో స్థిరపడిన అల్లూరీయులంతా ఈ తిరునాళ్లకు తరలిరావడంతో సంక్రాంతికి ముందే అల్లూరుకు పండుగ కళ వచ్చేసింది. సాంస్కృతిక కార్యక్రమాల్లో భాగంగా గాయనీమణులు శ్రావణ భార్గవి, సుగంధిని బృందం నేతృత్వంలో జరిగిన మ్యూజికల్‌నైట్ జనాన్ని కట్టిపడేసింది. పెద కాపులైన మేడా సోదరులు మనోహర్‌రెడ్డి, అశోక్‌కుమార్‌రెడ్డి తిరునాళ్లను గ్రామస్తుల సహకారంతో జగజ్జేయమానంగా నిర్వహించారు. ఈ సందర్భంగా రామకృష్ణా విద్యా సంస్థల పూర్వ విద్యార్థుల సంఘం నిర్వహించిన రాష్ట్రస్థాయి ఆహ్వాన వాలీబాల్ పోటీల్లో మిలటరీ ఏఓసి, సౌత్ సెంట్రల్ రైల్వే జట్లు ప్రథమ, ద్వితీయ స్థానాలు పొందాయి.

### విక్రమ సింహపురి యూనివర్శిటీలో విలీనం

కావలి పోస్ట్‌గ్రాడ్యుయేషన్ సెంటర్‌ను విక్రమ సింహపురి యూనివర్శిటీలో విలీనం చేస్తూ ఉన్నత విద్యాశాఖ జిఓ జారీ చేసింది. ఎస్వీ యూనివర్శిటీ పరిధిలో వున్న ఈ పిజి సెంటర్‌ను 1978లో ఏర్పాటు చేశారు. 78 ఎకరాల ప్రాంగణం ఈ పిజి సెంటర్ ప్రత్యేకత.

### దూలదీక్ష

వైఎస్ జగన్ ఢిల్లీలో చేపట్టిన జలదీక్షను దూలదీక్షగా అభివర్ణించాడు 20 సూత్రాల కమిటీ ఛైర్మన్, సీనియర్ కాంగ్రెస్ నేత తులసిరెడ్డి. 11వ తేది నెల్లూరుకు విచ్చేసిన ఆయన జగన్‌పై తీవ్ర విమర్శలు చేశాడు. అధికారం అనే దూలపట్టి దీక్షకు దిగాడు. అది దూలదీక్ష, ప్రచారదీక్ష అంటూ విరుచుక పడ్డారు. ఆయన చేస్తున్న విమర్శలు ఆయన తండ్రి రాజశేఖర్‌రెడ్డి సిఎంగా వున్నప్పుడు జరిగిన అక్రమాలపైనేనా అని ప్రశ్నించాడు.

కొరవ 14వ పేజీలో

● నెల్లూరు

# రైతులకు కష్టాలు

● కృష్ణాజలాల ట్రిబ్యునల్ తీర్పు ఫలితం

కృష్ణా జలాలపై ట్రిబ్యునల్ ఇచ్చిన తీర్పు నెల్లూరు జిల్లా రైతాంగంపై తీవ్ర ప్రభావం చూపనుంది. జిల్లాలో ప్రధాన నీటి వనరు సోమశిల ప్రాజెక్టు. 78 టిఎంసిల నీటి నిల్వ సామర్థ్యం వున్న సోమశిలకు పెన్నా నది ద్వారా నీరు చేరుతుంది. ప్రతి ఏడాది వర్షాల ద్వారా మహా అంటే 20 టిఎంసిల నీరు ప్రాజెక్టుకు చేరుతుంది. మిగిలిన నీరంతా శ్రీశైలం ప్రాజెక్ట్ నుంచి పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ ద్వారా సోమశిలకు వస్తుంది. శ్రీశైలం నీరంటే అవి కృష్ణా మిగులు జలాలే. జిల్లాలో పెన్నా డెల్టా కింద సుమారు 6.50 లక్షల ఎకరాల ఆయకట్టు వుంది. జిల్లా రైతులకు రెండు పంటలు పండించడం అలవాటు. అంటే ఏడాదికి 13 లక్షల ఎకరాలు సాగు చేస్తారు. ఈ సాగుకు అధికారిక లెక్కల ప్రకారం 110 టిఎంసిల నీరు అవసరం. భారీ వర్షాలు వస్తే మినహా పెన్నాలో 30 టిఎంసిలకు మించి నీరు రాదు. ఈ 30 టిఎంసిల నీరు వరదల లెక్క మూడేళ్లకు ఒక్కసారే నమోదవుతుంటుంది. ఇటువంటి పరిస్థితులలో వాస్తవంగా నెల్లూరు జిల్లా రైతులు కృష్ణానది జలాల మీదనే వ్యవసాయం చేస్తున్నారనాలి. కృష్ణానది జలాలపై ట్రిబ్యునల్ తీర్పు వల్ల పెన్నా డెల్టా ఎండిపోయే పరిస్థితులు దాపురించాయి. కండలేరు ప్రాజెక్టులో నీటి నిల్వ, చెన్నైకు తరలించే తెలుగు గంగ జలాలను ప్రస్తుత తీర్పులో పెంచిన దృష్ట్యా మొత్తం మీద గందరగోళమే చోటుచేసుకొంది. ఉరామరి లెక్కల ప్రకారం జిల్లాలో ఆయకట్టు అవసరాలకు 110 టిఎంసిల నీరు కావాలి. చెన్నై నీటి అవసరాల కోసం తరలించను మరో 24 టిఎంసిల నీరు వుండాలి. అంటే 140 టిఎంసిల నీరు ప్రతి ఏడాది జిల్లా ప్రజలకు సోమశిల ద్వారా అవసరమవుతాయి. కృష్ణా జిల్లాలపై ట్రిబ్యునల్ తీర్పులో ఆ నది మిగులు జలాలు శ్రీశైలం ప్రాజెక్టు, పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ల దాటుకొని వస్తాయా? పెన్నా వరదతోనే నెల్లూరుజిల్లా రైతులు వ్యవసాయం చేయగలరా అన్నది కాలమే నిర్ణయించాలి.

● తూతూమంత్రంగా

## చేపలమార్కెట్ పనులు!



పాత హాలులోనే కొత్త ఫ్లాట్‌ఫారాలు.

నెల్లూరు నగరంలోని చేపలు, మాంసం మార్కెట్లలో అతి ముఖ్యమైనది ట్రెకర్‌రోడ్డులోని మార్కెట్. పెద్ద మార్కెట్‌గా పేరుగడించిన ఈ మార్కెట్‌ను ఆధునిక మార్కెట్ చేస్తామని నెల్లూరులో ప్రజాసేవలో తరిస్తున్న నాయకులు 15 ఏళ్లకు పైగా వాగ్దానాలు చేస్తూనే వున్నారు. కానీ చేసిందేమీ లేదు. మార్కెట్ దగ్గరే ఆధునిక కబేళా నిర్మాణానికి అప్పటి ఎమ్మెల్యే జె.కె.రెడ్డి విడుదల చేయించిన కోట్లాది రూపాయల నిధులు ఏమయ్యాయో తెలియదుగానీ దీని పనులు అర్థాంతరంగా ఆగిపోయాయి. ఈ కబేళా కోసం నిర్మించిన కాంప్లెక్స్‌లోనే ప్రస్తుతం తాత్కాలిక చేపల మార్కెట్‌ను నడుపుతున్నారు.

పాత చేపల మార్కెట్‌ను కొత్తగా నిర్మిస్తామని కోటి 20 లక్షల రూపాయల నిధులు విడుదల చేశారు. ఈ నిధులతో వాస్తవానికి మంచి చేపల మార్కెట్‌ను నిర్మించి నెల్లూరీయులు పరిశుభ్రమైన చేపలు, మాంసం తినే ఏర్పాట్లు చేయవచ్చు. కానీ నిధులు ఏదోలా తినమరిగిన నేతలకు ఇవన్నీ పట్టవుగా? పాత మార్కెట్‌లో గతంలో కట్టి వుండిన హాలులోనే మాంసం, చేపలు అమ్ముకొనేటట్లు కాస్త ఎత్తు ఫ్లాట్‌ఫారాలు నిర్మిస్తున్నారు. వీటికి ఖర్చు పది లక్షల లోపే. ప్రస్తుతం ఈ ఫ్లాట్ ఫారంను ఆనుకొని రెండు గదులు కట్టారు. ఇంకా పాత గుడ్డలు, కూరగాయల వ్యాపారం చేసుకొనే వారికి నిర్మించి ఇస్తామన్న షెడ్ల కోసం సిద్ధం చేస్తున్న షాపులు మరీ బలహీనంగా వున్నాయి. రోడ్లు, విద్యుత్ సౌకర్యం అదీ ఇదీ అంటూ తూతూమంత్రపు పనులతో మొత్తానికి కోటి 20 లక్షల రూపాయలు ఎముకల సూప్‌లా జుర్రేయబోతున్నారు ఘనత వహించిన పాలకులు, వారికి బాగా సహకరించే అధికార యంత్రాంగం. ఇప్పటికైనా మునిగిపోయిందేమీలేదు. ఎంతో చరిత్ర కలిగిన ఈ మార్కెట్‌లో ఆధునీకరణ పనులు పదికాలాలపాటు వుండేలా శుద్ధంగా చేస్తే జనం సంతోషిస్తారు.

## జనగణన సక్రమంగా చేయండి!



సమావేశంలో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ రాంగోపాల్.

జనగణన కార్యక్రమాన్ని నిర్దేశించిన సూచలననుసరించి సక్రమంగా నిర్వహించాలని జిల్లా కలెక్టర్ రాంగోపాల్ అధికారులకు సూచించారు. కలక్టరేట్‌లోని గోల్డెన్ జూబ్లీ హాలులో 2011 జన గణన కార్యక్రమంపై రెవిన్యూ అధికారులకు శిక్షణా కార్యక్రమం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ జన గణన కార్యక్రమం పదేళ్లకొకసారి జరుగుతుందని, 2001లో జరిగిన జనగణన కార్యక్రమం అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొని ఎలాంటి సమస్యలు లేకుండా పటిష్టంగా నిర్వహించాలన్నారు. ఈ కార్యక్రమం ఫిబ్రవరి 9 నుండి 28వ తేది వరకు జరుగుతుందన్నారు. ప్రతి కుటుంబంలో జనాభా, వారు చేస్తున్న వృత్తులు, ఆస్తులు, భవనాలు తదితర పూర్తి వివరాలు సేకరించాలన్నారు. వివిధ వృత్తుల్లో వుండేవారి వివరాలు, వ్యవసాయం, వ్యవసాయేతర వృత్తులను గుర్తించి తదనుగుణంగా వివరాలు నమోదు చేయాలన్నారు. జనగణన కార్యక్రమానికి నియమించిన అధికారులకు, సిబ్బందికి ఎటువంటి సెలవులు వుండవన్నారు. ఈ కార్యక్రమం సంక్షేమ పథకాల అమలుకు వీలుగా ప్రణాళిక రూపకల్పనకు ఉపయోగపడుతుంది అన్నారు. ఈ సమావేశంలో జన గణన శాఖ డైరక్టర్ వై.సుబ్రహ్మణ్యం ప్రత్యేక సూచనలిచ్చారు. డిఆర్వో జయరామయ్య, ఆర్డీఓలు వేణుగోపాల్‌రెడ్డి, బి.రామమూర్తి, డి.వెంకటేశ్వర్లు కూడా ఈ సమావేశానికి విచ్చేశారు.

## అమాత్యా... రోడ్లన్నీ దెబ్బతిన్నాయి!



నెల్లూరులోని ముత్తుకూరురోడ్డు ప్రాంతంలో దెబ్బతిన్న రోడ్డు.

జిల్లాలోని పది నియోజకవర్గాల పరిధిలోని వందలాది గ్రామాల్లో రోడ్లు బాగా దెబ్బతినిపోయాయి. ముఖ్యమంత్రులుగా పనిచేసిన దివంగత వైఎస్‌రాజశేఖర్‌రెడ్డి, రోశయ్య రోడ్ల మరమ్మత్తులు, నిర్మాణాలకు నిధులు మంజూరు చేయలేదు. ఈ మధ్యే ఆర్థిక శాఖా మంత్రి అయిన ఆనం రామనారాయణరెడ్డి జిల్లాలో భారీవర్షాలకు దెబ్బతిన్న రోడ్ల మరమ్మత్తులకు వరద సహాయక నిధుల పద్దులో కోటి 76 లక్షల రూపాయలు కేటాయించగా ఈ మొత్తంలో అగ్రభాగంగా ఆత్మకూరు నియోజకవర్గంలోని 12 రోడ్ల బాగుకు 42 లక్షల రూపాయలు మంజూరు చేశారు. మిగతా తొమ్మిది నియోజకవర్గాలకు నామమాత్రపు కేటాయింపులే చేశారు. ఆర్థిక మంత్రి అయ్యాక ఆత్మకూరుపై ఆయనకు ప్రత్యేక ప్రేమ పుట్టినట్లుంది. ఆత్మకూరు – చేజర్ల మండలాలను కలుపుతూ అప్పారావుపాళెం గ్రామం వద్ద పెన్నానదిపై వంతెన నిర్మాణానికి 50 కోట్ల రూపాయలు. ఆత్మకూరు సమీకృత నీటి పథకానికి తొమ్మిది కోట్ల రూపాయలు మంజూరు చేయించారు. సమీకృత నీటి పథకాన్ని అనుమసముద్రంపేట, అనంతసాగరం మండలాలకు విస్తరించే ప్రతిపాదనలు ఇటీవల తయారయ్యాయి. ఆర్థిక మంత్రి చెబితే అన్ని ప్రభుత్వ శాఖలు పనులు చేస్తాయి. ఈ పలుకుబడిని ఆర్థిక మంత్రి జిల్లాలో మిగిలిన తొమ్మిది నియోజకవర్గాల అభివృద్ధికి కూడా ఉపయోగిస్తే బాగుంటుంది.

## క్రీడలపై రాజకీయ క్రీనీడలు!



● హాకీ అసోసియేషన్ పేరిట కాకాణిని బుక్ చేయించారు.

జిల్లాలో నెలకొన్న రాజకీయ వర్గ పోరు, గ్రూపుల కుమ్ములాటలు చివరకు క్రీడలపైనా ప్రభావం చూపిస్తున్నాయి. ఫలితంగా సంఘాల ఏర్పాటు, క్రీడల నిర్వహణలోనూ ఇవి ప్రస్ఫుటం అవుతున్నాయి. కాంగ్రెస్ పార్టీలో ఆనం సోదరులకు, జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డికి ఉప్పు, నిప్పు అన్న సంగతి తెలిసిందే. ఎవరికి వారు రాజకీయంగా ఎత్తులు పైఎత్తులు వేసుకొంటూ వర్గ రాజకీయాలు నడుపుతున్నారు. ఈ పరిస్థితులలో కాకాణి ఆంధ్రా హాకీ అసోసియేషన్‌కు రాష్ట్ర అధ్యక్షుడిగా ఎంపికయ్యాడు. జాతీయస్థాయిలో ఇండియన్ హాకీ ఫెడరేషన్‌కు(ఐహెచ్‌ఎఫ్), హాకీ ఇండియా(హెచ్ఐ)కు కె.పి.ఎస్.గిల్, సురేష్ కల్మాడీలు సారథ్యం వహిస్తున్నారు. వీటికి సంబంధించిన గుర్తింపు కోసం కోర్టుల్లో కేసులు నడుస్తున్నాయి. ఈ నేపథ్యంలో ఇండియన్ హాకీ ఫెడరేషన్‌కు అనుబంధంగా రాష్ట్రంలో ఆంధ్ర హాకీ అసోసియేషన్‌కు కాకాణి బాధ్యతలు చేపట్టి జిల్లాలోనూ సంఘాన్ని ఏర్పాటు చేశారు. గోవర్ధన్‌రెడ్డిని వ్యతిరేకిస్తున్న ఆనం సోదరులు ప్రత్యామ్నాయంగా హాకీ ఆంధ్రప్రదేశ్ తరపున హాకీ నెల్లూరు జిల్లా పోటీల నిర్వహణకు శ్రీకారం చుట్టారు. దీనికి కార్యదర్శిగా వున్న ఒక పిఇటి ఇరువురి మధ్య వున్న రాజకీయవైరాన్ని తనకు అనుకూలంగా మలచుకొని లబ్ధిపొందేందుకు ఎపికలకు ప్రయత్నిస్తున్నట్లు ఆరోపణలు వినవస్తున్నాయి. దీనికి బలం చేకూరుస్తున్నట్లు హాకీ ఆంధ్ర రాష్ట్ర కార్యదర్శి నేరుగా జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డిని టార్గెట్ చేసుకొని విమర్శలు చేయడం వెనుక ఆనం సోదరుల హస్తం వున్నట్లు తెలుస్తోంది.

# కెసిఆర్‌కు తాయిలం?

తమ పార్టీ ఎమ్పీలు, ఎమ్మెల్యేలను అదుపు చేయడంలో దారుణంగా విఫలమౌతున్న కాంగ్రెస్ అధిష్టానం టిఆర్ఎస్ అధినేత కెసిఆర్‌ను మచ్చిక చేసుకోవడంలో మాత్రం సఫలమైనది. శ్రీకృష్ణ కమిటీ నివేదికలో తెలంగాణ ఇవ్వాలన్న సిఫార్సు లేకుంటే డిసెంబర్ 31 తర్వాత భూకంపం పుట్టిస్తానని ప్రగల్భాలు పలికిన కెసిఆర్, వున్నట్లుండి మన్ను తిన్న పాము వలె బజ్జోవడానికి కారణం కాంగ్రెస్ పెద్దలిచ్చిన తాయిలమే కారణమని చెప్తున్నారు. డిసెంబర్ 31 తర్వాత ఏదో జరిగిపోతుందన్న భావన సాధారణ ప్రజలతోపాటు, అగ్రనేతలలో కూడా దట్టంగానే వుండింది. అందుకే, 50 కంపెనీల పారా మిలటరీ బలగాలను దింపి, కవాతు చేయించారు. కానీ అనూహితంగా కెసిఆర్ మాత్రం, శ్రీకృష్ణ కమిటీ నివేదిక తన కనుకూలం కాకపోయినా, ఆవేశం ప్రదర్శించలేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థులను పోలీసులు చావబాదుతున్నా తనకు పట్టనట్లు వుండిపోయాడు. ఈ మౌనానికి కారణం, ఢిల్లీ పెద్దలతో కుదుర్చుకొన్న ఒప్పందమే కారణమన్నది బహిరంగ రహస్యం. శాంతిభద్రతల సమస్య తలెత్తకుండా, ఫిబ్రవరి బడ్జెట్ సమావేశాల వరకు నిగ్రహం పాటిస్తే, తెలంగాణ విషయంలో తామొక స్పష్టమైన నిర్ణయం తీసుకొంటామని ప్రణబ్ ముఖర్జీ కెసిఆర్‌కు హామీ ఇచ్చాడట. ఆ ఆశతోనే ఆయన హైదరాబాద్‌లో అల్లర్లు చెలరేగకుండా తెలంగాణ ఉద్యమాన్ని పగ్గాలు పట్టి ఆపుతున్నాడు. కారణం ఏదైనా, రాజధాని నగరంలో శాంతిభద్రతలు నెలకొనడం జనానికి సంతోషం కల్గిస్తున్నది.

# దీక్షకు శిక్ష న్యుమోనియా!

జగన్‌తో పాటు ఢిల్లీలో జరిగిన లక్ష్య దీక్షలో పాల్గొన్న అనుచరులు, అభిమానులు తీవ్రమైన అనారోగ్యంతో బాధపడే ప్రమాదం వుందని వైద్యులు హెచ్చరిస్తున్నారు. ఒళ్లు గడ్డకట్టించే చలితో గజగజ లాడుతున్న ఢిల్లీలో, ఈ సమయంలో ఆరుబయట దీక్షలు తలపెట్టడం చాలా క్రూరమైన రాజకీయ వినోదం క్రిందే లెక్క. సాధారణ మూడవ తరగతి పెట్టెలలో ప్రయాణించిన అనుచరులకు ఢిల్లీలో కనీసం వుండడానికి వసతి కూడా ఏర్పాటు చేయలేదు. కోల్డ్ స్టోరేజ్‌ను తలపింపచేసే ఆ రైలు పెట్టెలలోనే వారికి బస. మొదటి రోజు పొగమంచుతో దారి కన్పించక ఒక రాత్రంతా ఢిల్లీ శివార్లలో నిలిపివేశారు రైలును. పక్కరోజు దీక్ష తర్వాత కూడా అదే పరిస్థితి. ఢిల్లీ చలి చాలా ప్రమాదకరమైనది. సరైన జాగ్రత్తలు తీసుకోకపోతే న్యుమోనియా జ్వరం దాడి చేస్తుంది. ఊపిరితిత్తులను కొరికి వేస్తుంది. తమ కోసం అంత దూరం వచ్చిన అమాయక అనుచరుల విషయంలో జగన్ చాలా నిర్లక్ష్యంగా ప్రవర్తించారు. వారికి ఢిల్లీలో బస కూడా ఏర్పాటు చేయలేదు. చలి తట్టుకోవడానికి కంబళి కూడా ఇవ్వలేదు. ఎమ్మెల్యేలు, డబ్బున్న మహరాజులు హోటల్ గదులలో, వెచ్చటి హీటర్ల మధ్య బజ్జుంటే, ఈ పిచ్చి అనుచరగణం చలికి వణుకుతూ రైలు పెట్టెలలోనే ముడగదీసుకొని పడుకొన్నారు. తిరిగి వచ్చిన తర్వాత వారు తీవ్రమైన అనారోగ్యం బారిన పడక తప్పదని హెచ్చరిస్తున్నారు వైద్యులు.

### • ఆ పార్టీ మొత్తం

# జగనంత కుటుంబం

రాష్ట్ర రాజకీయాలలో వైఎస్.జగన్ ఎంత పెద్ద పెనుతుఫాను సృష్టిస్తున్నాడో ప్రత్యేకంగా వివరించి చెప్పనవసరం లేదు. ఎక్కడ ఏ నలుగురు మాటా మంతీ కలిపినా జగన్ ముచ్చట్లు తప్ప వేరొకటి వుండడం లేదిప్పుడు. అంత చిన్న వయస్సులో అంత విస్తృతస్థాయి రాజకీయ ప్రాభవం పూర్వజన్మ సుకృతం. అయితే ఆ మహాదృష్టాన్ని, మహాభాగ్యాన్ని సద్వినియోగం చేసుకొనే పరిణితి జగన్‌లో వుందా అన్నదే పెద్ద సందేహం.

తన కొత్త పార్టీ స్థాపనకు ఎలక్షన్ కమిటీకి దరఖాస్తు సమర్పించారాయన. అందులో ఆయన వ్రాసిన పేర్లు – అధ్యక్షుడు జగన్మోహన్‌రెడ్డి, ఉపాధ్యక్షుడు సుబ్బారెడ్డి, కార్యదర్శి భద్రారెడ్డి, కోశాధికారి అనుమారెడ్డి. రాష్ట్రంలో రాజకీయ అధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి ఉరఉరలాడుతున్న పార్టీకి తన కుటుంబంలోని వారు తప్ప ఇతరులెవ్వరూ దరఖాస్తులో పేరు వ్రాయడానికి కూడా పనికి రాలేదు జగన్‌కు. కొండా సురేఖ, మేకపాటి రాజమోహన్‌రెడ్డి, సబ్బం హరి, ముద్రగడ పద్మనాభం, కొణతాల రామకృష్ణ వంటి రాజకీయ సీనియర్లు ఎందరో జగన్ వెంట నడుస్తున్నారు. కాంగ్రెస్‌తో తమ అనుబంధాన్ని, తమ పదవులను తృణప్రాయంగా వదలుకొని జగన్‌తో నడవడానికి సిద్ధపడుతున్నారు. కొత్త రాజకీయ పార్టీ స్థాపనలో వారినెవ్వరినీ భాగస్వాములను చేయలేకపోయాడు జగన్. తన కుటుంబ సభ్యులతో మాత్రమే కార్యవర్గాన్ని నింపాడు. దాన్నిబట్టే ఆయన అపరిపక్వత ఎంతో చెప్పకనే అర్థమై పోతుంది.

కొరవ 14వ పేజీలో

# రక్షణ కరవైన ఎర్రచందనం!

## గోడౌన్లలో నిల్వలు పెరిగాయి

జిల్లాలో వివిధ ప్రాంతాల్లో నిల్వ చేసిన ఎర్రచందనం దుంగలకు రక్షణ కరువవుతోంది. గోడౌన్లు లేక కోట్ల రూపాయలు విలువచేసే ఎర్రచందనాన్ని ఆరు బయటే వుంచడంతో ఇవి చోరీకి గురౌతున్నాయి. స్మగ్లర్ల నుంచి పట్టుకొన్న దుంగలను నిల్వ చేసేందుకు వెంకటగిరి, పొదలకూరు ప్రాంతాల్లో మాత్రమే గోడౌన్లు వున్నాయి. ఈ రెండు గోదాముల్లో ప్రస్తుతం 1100 టన్నుల మేర ఎర్రచందనం నిల్వ వుంది. వీటి విలువ 60కోట్ల రూపాయలు వుంటుంది. జిల్లాలోని వెంకటగిరి, రాపూరు, ఆత్మకూరు, సీతారాంపురం, మర్రిపాడు ప్రాంతాలతోపాటు కడప, చిత్తూరు సరిహద్దు ప్రాంతాల్లో అక్రమంగా తరలిపోతున్న దుంగలను పట్టుకొన్నా ఈ రెండు గోడౌన్లలోనే భద్రపరచాల్సి వుంది. అంత సామర్థ్యం లేకపోవడంతో ఆరుబయటే వీటిని నిల్వ చేస్తున్నారు. గతంలో గ్లోబల్ టెండర్ల ద్వారా ఎర్రచందనాన్ని వేలం వేసే వారు. ప్రభుత్వం గత ఆరేళ్ల నుంచి ఈ టెండర్ల ప్రక్రియను నిలిపివేయడంతో గోదాముల్లో ఎర్రచంద్రనం నిల్వలు భారీగా పెరిగిపోయాయి. వీటి రక్షణకు అధికారులు సరైన చర్యలు చేపట్టకపోవడంతో దుంగలు గోడౌన్ల నుంచి తస్కరింపబడుతున్నాయి. ప్రైవేట్ కాపలాదారులను దుంగల రక్షణకు నియమించడంతో దొంగలకు ఆస్కారం లభించిందనే విమర్శలు వస్తున్నాయి. వెంకటగిరిలో 125 ఎర్రచందనం దుంగలు మాయమవడంలోనూ ఈ లొసుగులే కారణంగా తెలుస్తుంది. దొంగలను పట్టుకొన్నా మిగతా వాటికి ఈనాటికీ రక్షణ కొరవడడంతో కోట్లరూపాయలు విలువ చేసే ఎర్రచందనం నిల్వలపై సందేహాలు ఏర్పడుతున్నాయి.






నెల్లూరీయుడు, చెన్నైలో చేయి తిరిగిన వైద్యునిగా పేరుగాంచిన డాక్టర్ సిఎంకె.రెడ్డికి ఎమ్జీఆర్ మెడికల్ యూనివర్శిటీ తరపున లైఫ్ టైం అచీవ్‌మెంట్ అవార్డు అందజేస్తున్న తమిళనాడు ఉపముఖ్యమంత్రి ఎం.కె.స్టాలిన్. వేదికపై గవర్నర్ సూర్జిత్‌సింగ్ బర్నాలాను చూడొచ్చు.



వైఎస్ జగన్‌ను హైదరాబాద్‌లో కలసి ఆయనకు మద్దతు తెలియజేస్తున్న కావలి నియోజకవర్గ ప్రజారాజ్యం పార్టీ ఇన్‌ఛార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి. మధ్యలో ఉదయగిరి ఎమ్మెల్యే చంద్రశేఖర్‌రెడ్డి, చిరంజీవిరెడ్డి వున్నారు.

# గ్యాస్ లారీని దిగ్భంధించారు!

## కట్టలు తెంచుకొన్న మహిళల ఆగ్రహం

గ్యాస్ సిలిండర్లు సక్రమంగా పంపిణీ చేయడం లేదని ఆరోపిస్తూ బిట్రగుంట చెంచులక్ష్మీపురంకు చెందిన మహిళలు గ్యాస్ సిలిండర్ల లోడ్‌తో వెళ్తున్న లారీని దిగ్భందించారు. ఈ ప్రాంతంలో గల హెచ్‌పి గ్యాస్ ఏజన్సీ నిర్వాహకులు సక్రమంగా సిలిండర్లను పంపిణీ చేయడం లేదని గత కొంతకాలంగా వినియోగదారులు పలుమార్లు ఫిర్యాదు చేశారు. పౌరసరఫరాల శాఖాధికారులకు తెలిపినా పట్టించుకోకపోవడంతో విసిగిపోయిన మహిళలు ప్రత్యక్ష చర్యలకు పూనుకొన్నారు. దీనిలో భాగంగా చెంచులక్ష్మీపురం వాసులు పెద్ద సంఖ్యలో వచ్చి లారీని నిలిపి వేశారు. విషయం తెలుసుకొన్న బోగోలు ఎస్ఐ వీరేంద్రబాబు అక్కడకు చేరుకొని సర్దిచెప్పే ప్రయత్నం చేయగా మహిళలు తీవ్ర నిరసన తెలిపారు. సకాలంలో గ్యాస్ సరఫరా చేయకుండా బ్లాక్‌లో విక్రయిస్తూ వినియోగదారులను ఇబ్బంది పెడుతున్నారని ఆగ్రహించారు. ఎస్ఐ గ్యాస్ ఏజన్సీ వాళ్లకు నచ్చజెప్పి అప్పటికప్పుడు 200 సిలిండర్లను ఇప్పించడంతో మహిళలు లారీని విడచిపెట్టారు. ఈ వార్త మండలంలో సంచలనం కల్గించింది.

● కోవూరు

# సాయిబాబా ఆలయంలో చోరీ!

కోవూరు సాయిబాబా ఆలయంలో దొంగలు పడ్డారు. 2తేది రాత్రి మందిరంలో ప్రవేశించిన దొంగలు బాబాకు సంబంధించిన 28కిలోల వెండి సామగ్రిని, 5సవర్ల బంగారు వస్తువులను దొంగిలించారు. ఈ ఆలయాన్ని పచ్చిపాల గోపాలరెడ్డి సొంత స్థలంలో నిర్మించాడు. భక్తుల రద్దీ అధికంగా వుండే ఈ ఆలయానికి వాచ్‌మెన్ వున్నా దొంగతనం జరగడం కలకలం రేపింది. ఎస్పీ దామోదర్‌ను కలసిన ఛైర్మన్ గోపాలరెడ్డి దొంగతనం జరిగిన తీరును వివరించగా దొంగలను పట్టుకోను ఆయన ప్రత్యేక బృందాలను ఏర్పాటు చేశారు. మొత్తం మీద ఆలయాల్లో చోరీలు అధికం కావడం భక్తులను ఆందోళనకు గురిచేస్తున్నాయి.



నెల్లూరీయుడు బెంగుళూరులో స్థిరపడ్డ రావి మోహన్ చౌదరికి అక్కడ నుంచి వెలువడే తెలుగుతేజం పత్రిక ప్రకటించిన గౌరవ పురస్కారాన్ని అందిస్తున్న శివసాయిబాబా స్వామి. ప్రక్కన డాక్టర్ ఏ.రాధాకృష్ణరాజు, లలితారెడ్డి, రంగదేవరాయలు, పత్రికా సంపాదకుడు మాల్యాద్రి వున్నారు.

# దొంగ బియ్యం - డొంక తిరుగుడు!

కావలి పట్టణంలో పోలీసులు పట్టుకున్న చౌక బియ్యం వ్యవహారం అనేక మలుపులు తిరుగుతోంది. పట్టణంలో గల ఒక మిల్లులో అక్రమంగా నిల్వ వుంచిన 1500 బస్తాల చౌక దుకాణాలకు సరఫరా చేసే బియ్యాన్ని పోలీసులు పట్టుకొన్నారు. తమకు అందిన సమాచారం మేరకు సిఐ శ్రీనివాసన్ ఆధ్వర్యంలో పోలీసులు దాడులు జరిపి ఈ అక్రమ నిల్వలను వెలికి తీశారు. రెవెన్యూ అధికారులను పిలిపించి వారికి విషయం తెలిపారు. డిప్యూటి తహశీల్దార్ శ్యామలమ్మ తదితరులు గోడౌన్‌ను సీజ్ చేశారు. తిరిగి తెల్లవారి వచ్చి చూడగా బియ్యం బస్తాలు మాయమై వుండడం అందరిని ఆశ్చర్యపరచింది. రెవెన్యూ అధికారులు దీనిపై పోలీసులను ప్రశ్నించడంతో వారు రెవెన్యూ సిబ్బంది తీరుపై అసహనం వ్యక్తం చేశారు. చివరకు బియ్యం నిల్వలను రాత్రికి రాత్రి సీల్ వేసి వుండగానే మాయం చేసిన వ్యక్తులను పట్టుకొని విచారించడంతో నిజం బయటపడింది. మిల్లు యజమాని శ్రీనివాసరావు, సుబ్బారావు అనే వ్యక్తులు కూలీలతో ఈ పని చేశారు. వెనుక వైపు తాళాలు పగులగొట్టి బస్తాలు తరలించారు. ఇక్కడ రెవెన్యూ అధికారుల డొల్లతనం బయటపడింది. వెనుకవైపు తలుపులు గురించి పట్టించుకోకుండా ముందువైపు సీల్ వేసి తమ తెలివి తక్కువతనాన్ని నిరూపించుకొన్నారు. అయితే పోలీసులు 1500 బస్తాలని చెప్తుండగా, డిటి శ్యామలమ్మ ఇతరులు చెప్పే లెక్కలకు పొంతన కుదరడం లేదు. రెవెన్యూ సిబ్బందికి, బియ్యం అక్రమార్కులకు వున్న లోపాయికారి ఒప్పందాలే బస్తాలు మాయం కావడానికి, తప్పుడు లెక్కలు చెప్పడానికి కారణమనే గగ్గోలు రేగుతుంది.

**విస్తుపోయిన కావలి జనం**

## కండలేరు కాలువపై వంతెన

**పోర్టు నిర్వాహకులే పుణ్యం కట్టుకొన్నారు**

ముత్తుకూరు మండలం కృష్ణపట్నం ఓడరేవు సమీపంలోని కండలేరు కాలువపై వంతెన నిర్మాణ పనులు జోరుగా సాగుతున్నాయి. ముత్తుకూరు, చిల్లకూరు మండలాల సరిహద్దు అయిన ఈ కాలువపై 1500 మీటర్ల మేర వంతెన నిర్మాణం జరుగుతోంది. ప్రభుత్వమే ఈ కాలువ నిర్మాణ పనులను చేపడుతుందని శాసనసభ్యులు ఆదాల ప్రభాకర్‌రెడ్డి గతంలో ప్రకటించారు. సంబంధిత అధికారులు ఆ దిశగా చర్యలు చేపట్టక పోవడంతో నవయుగ సంస్థే ఈ నిర్మాణ పనులు చేపట్టింది. ఓడరేవు ఆధారిత పరిశ్రమలు చిల్లకూరు మండలంలో వుండడంతో వంతెన నిర్మాణం వల్ల రెండు మండలాల వారికి ఉపయోగకరంగా మారనుంది. చిల్లకూరు మండలంలోని గుమ్మళ్లదిబ్బ, తమ్మినపట్నం, వరగలి, మోమిడి, చింతవరం, కనుపూరు గ్రామాల ప్రజలు పడవ ప్రయాణం చేసే కష్టాలు తీరనున్నాయి.

## మరో రైల్వే యూనిట్ పోయేట్లుంది!

విజయవాడ డివిజన్ పరిధిలో పీరియాడికల్ ఓవర్‌హాలింగ్ (పిఓహెచ్) కేంద్రాన్ని ఏర్పాటు చేసే విషయమై రైల్వే అధికారులు వ్యవహరిస్తున్న తీరుపై రైల్వే వర్గాల్లో తీవ్ర నిరసన వ్యక్తం అవుతోంది. డివిజన్ పరిధిలో గల బిట్రగుంటలో దీని ఏర్పాటుకు కావలసిన అన్ని వసతులు, సౌకర్యాలు వున్నాయి. దక్షిణ మధ్య రైల్వేలో అత్యంత ఆదాయాన్ని సమకూరుస్తున్నా అధికారులు, నేతల నిర్లక్ష్యానికి గురౌతూనే వుంది. పిఓహెచ్ ఏర్పాటుకు భారతీయ రైల్వే కార్మికుల జాతీయ సమాఖ్య ఏళ్ల తరబడి డిమాండ్ చేస్తున్నా రైల్వే బోర్డు మాత్రం ఈ అంశంపై ఎలాంటి నిర్ణయం తీసుకోకుండా నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరించడంపై తీవ్ర విమర్శలు వ్యక్తమవుతున్నాయి. బిట్రగుంటలో అన్ని రైళ్లకు సకాలంలో మరమ్మత్తులు చేసే వీలు కల్గుతుంది పిఓహెచ్ ఏర్పాటు వలన. దీని వలన 10వేల మందికి ప్రత్యక్షంగా, పరోక్షంగా ఉపాధి లభిస్తుంది. వేల ఎకరాల రైల్వే స్థలం, క్వార్టర్లు, నీటి వసతి వున్న ఈ ప్రాంతాన్ని అధికారులు పరిగణనలోకి తీసుకోకపోవడంపై కార్మికులు అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. ఇప్పటికైనా అధికారులు స్పందించి పిఓహెచ్‌ను బిట్రగుంటలో ఏర్పాటు చేయాలని యూనియన్లు డిమాండ్ చేస్తున్నాయి.

**బిట్రగుంటకు ఎవరు శాపం పెట్టారో?**

# సరదాలు తెచ్చే సంక్రాంతి

మహాపురుషులు జన్మమెత్తిన రోజులు, దుష్టులు కడతేరిన రోజులు సాధారణంగా మనకు పండుగలయ్యాయి. ఇవే కాకుండా గ్రహసంచారాలతో మానవాళికి మంచి జరిగే పుణ్యదినాలను పర్వదినాలుగా పరిగణించడం పరిపాటి. అంతటి ప్రాధాన్యత గల పండుగే సంక్రాంతి. సంక్రాంతి అనగా సంక్రమణం. అంటే మారడం. పుష్యమాసం హేమంత రుతువులో శీతగాలులు వీస్తూ మంచు కురిసే కాలంలో సూర్యుడు మకరరాశి లోకి ప్రవేశించడాన్ని మకర సంక్రమణం అని, మకర సంక్రాంతి అని అంటారు. సూర్యుడు ఉత్తరాయణంలోకి అడుగుపెడతాడని అర్థం. సంక్రాంతి నాడు రైతులకు ధాన్యం ఇంటికి చేరుతాయి. అన్ని పండుగలలోకెల్లా సంక్రాంతికి పెద్ద పండుగ అని పేరు. పెద్దలకు పుణ్యగతులు ప్రసాదించే పండుగ కాబట్టి పెద్దల పండుగ అని కూడా పిలుస్తారు. జనవరి 14, 15 తేదీలలో ఆంధ్రదేశంతోపాటు వివిధ రాష్ట్రాల్లో భోగి, సంక్రాంతి పండుగలను జరుపుకొంటారు.

ప్రళయస్థితిలో భూమండలం సముద్రంలో మునిగి వుంటే ఆది వరాహ రూపంలో విష్ణుమూర్తి భూమిని మకర సంక్రాంతి నాడు ఉద్ధరించాడంటారు. కురువృద్ధుడు భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలంలోనే తనువు చాలించినట్లు పురాణాలు చెప్తున్నాయి. ఈ మాసంలో వైకుంఠ ద్వారాలు తెరచి వుంటాయని, పుణ్యగతులు సంతరిస్తాయని విశ్వాసం. సంక్రాంతి పండుగను మూడురోజులపాటు నిర్వహిస్తారు. మొదటిరోజు భోగి అని, రెండవ రోజు సంక్రాంతి అని, మూడవ రోజున కనుమ అని పిలుస్తారు. చలిని తరిమివేయడంతోపాటు దారిద్రాన్ని మంటలలో వదిలివేసి క్రొత్తగా నూతన జీవితాన్ని ప్రారంభించడం భోగి ఉద్దేశ్యం. ఇంటిలోని పాత చీపుర్లు, కొయ్య సామాన్లు, తాటాకులతో భోగి మంటలు వేస్తారు. ఆనాటి సాయంత్రం బొమ్మల కొలువులు పెట్టడం, భోగి పళ్లు పోయడం చేస్తారు. భోగి పళ్లు అనగా రేగిపళ్లు. విష్ణువుకు ప్రీతికరం కాబట్టి వీటిని పిల్లల తల మీద పోయడం వలన వారి కృప పిల్లలకు లభిస్తుందని నమ్మకం.

పెద్దలకు తర్పణం వదలడం, వారి పేరున దానధర్మాలు చేయడం సంక్రాంతి రోజున చేస్తారు. ఇంటి ముందు రంగవల్లులు, గొబ్బెమ్మలు పెట్టి గొబ్బిపాటలు పాడతారు. గుమ్మడి పూలతో అలంకరిస్తారు. కళ్లాపి చల్లి చదును చేసిన నేలను మేఘాలు లేని ఆకాశంగా, ముగ్గుతో పెట్టే చుక్కలను నక్షత్రాలుగా, చుక్కలను గజిబిజిగా కలపడాన్ని ఖగోళంలో జరిగే మార్పులకు సూచికగా, నడుమపెట్టే చుక్కను సూర్యుని సంకేతంగాను, గొబ్బెమ్మను లక్ష్మీదేవి ప్రతిరూపంగా భావిస్తారు.

మూడవ రోజున జరిపే కనుమ పండుగను పశువుల పండుగ అంటారు. ఆనాడు తమకు ఉపకరించే ఆవులు, గేదెలు తదితర పశుజాతిని అందంగా అలంకరించి పసుపు, కుంకుమలు పెట్టి పూజిస్తారు. కనుమ రోజున ప్రయాణాలు చేయరు. ఈ మూడు రోజులు తెలుగు పల్లెలు రంగవల్లులు, హరిదాసు కీర్తనలు, జంగందేవర, గంగిరెద్దులు, బుడబుక్కల వారి దీవెనలతో బంధుమిత్రుల రాకతో ఆనందంగా ఆహ్లాదంగా అలరారుతుంటాయి.

ట్రంకు రోడ్డు

## ఒకే థియేటర్ రెండు సినిమాలు



నెల్లూరు నగరంలోని సినిమా థియేటర్లను మల్టీప్లెక్స్‌లుగా మార్చేయత్నంలో ఏడు థియేటర్లను మూసేశారు. ఈ థియేటర్లలో కొత్త సినిమాలాడేవి. ఒక్కసారిగా థియేటర్ల మూతతో సినిమాలు వేయడం కష్టమయ్యింది. దీంతో వున్న థియేటర్లలోనే మార్నింగ్ షో, మ్యాట్నీ ఒక సినిమా, ఫస్ట్ షో, సెకండ్ షో మరో సినిమా వేస్తున్నారు. ఈ విధానంతో థియేటర్ల కొరత కొంత తీరడంతోపాటు సినిమా కొన్నాళ్లు నడిచిందన్న తృప్తి నిర్మాతలకు, ఎగ్జిబిటర్లకు మిగిలేట్లుంది.

## భలే దొంగలు



నెల్లూరులో దొంగతనాలు జోరందుకొన్నాయి. ఇళ్లు, దేవాలయాలనే తేడా లేకుండా దోచుకొంటున్నారు. దారిన నడిచివెళ్లే మహిళల మెడల్లోని సరుళ్ల లాగేస్తూ ఇంతులను బయట కాలు పెట్టనీయకుండా భయోత్పాతం సృష్టిస్తున్నారు. రొటీన్ దొంగతనాలేమిటని కొందరు దొంగలు ఇళ్లలో పార్కింగ్ చేసుకొన్న స్కూటర్లను పట్టుకెళ్తుండగా మరికొందరు ఆటోలు, లారీల టైర్లను, బ్యాటరీలను విప్పదీసుక వెళ్తున్నారు. మొత్తం మీద టైర్లు, బ్యాటరీల దొంగల దెబ్బకు వాహన యాజమానులు హడలిపోతున్నారు. రాత్రుళ్లు తమ వాహనాలను దొంగల నుంచి కాపాడాలని దేముళ్లను మొక్కుతున్నారు.

## రోడ్డుపై రంగవల్లులు



రోడ్డుపై ద్విచక్ర వాహనం పెడితేచాలు నెల్లూరు ట్రాఫిక్ పోలీసులు చెప్పాపెట్టకుండా పట్టుకెళ్లిపోతారు. రెండు వందల రూపాయల ఫైన్ కట్టి వాహనాన్ని తిరిగి తెచ్చుకోవాలి. కాని ఎవరైనా పెద్ద మనుషులు రోడ్డుపై అడ్డంగా ఏ పని చేసినా చూడనట్లు వ్యవహరిస్తున్నారు. మూలాపేటలోని పోలీస్ క్వార్టర్ల దగ్గరే సిటీ కాంగ్రెస్ అధ్యక్షుడు చాట్ల నరసింహారావు స్కూల్ నిర్వహిస్తున్నారు. స్కూల్ పిల్లలకు సంక్రాంతి పండుగను పురస్కరించుకొని రోడ్డుపై రంగవల్లుల పోటీ పెట్టారు. దీనికి గాను రోడ్డు పరిసరాలన్నీ కార్పొరేషన్ శానిటరీ విభాగం శుభ్రపరచి సున్నంతో గీతలు గీయించి మరీ ఇచ్చింది. రోడ్డుపై ఈ రంగవల్లులేమిటని ఇక్కడే కాపురమున్న వంద మంది పోలీసులు, ఇద్దరు ఎస్ఐలు, ఒక సిఐ, మరో డిఎస్పీలలో ఒక్కరూ 'అయ్యోరి'ని ప్రశ్నించలేదు. సామాన్యులపై మాత్రం పెద్ద ఫోజుతో రెచ్చిపోతారు మన నెల్లూరు పోలీసులు. ఖాకీ దుస్తులు సామాన్యుడిని ఇబ్బంది పెట్టనా ప్రభుత్వం ఇచ్చింది??

## ఐఎఎస్‌ల పైలాపచ్చీసు




రాష్ట్రంలో రాజకీయ అనిశ్చితి ఐఎఎస్ అధికారులకు వరంగా మారింది. ఏ క్షణంలో అయినా రాష్ట్రప్రభుత్వం మైనారిటీలో పడుతుందన్న వార్తలు జోరుగా షికారు చేస్తుండటం ఐఎఎస్‌లకు ఆటవిడుపుగా వుంది. మంత్రులు కూడా ఏ క్షణంలో ఏం జరుగుతుందో అంటూ డోలాయమానంలో వుండటంతో ఐఎఎస్‌లు రిలాక్స్‌గా ఫీలవుతున్నారు. శాఖాపరంగా జరగాల్సిన కార్యక్రమాలు నత్తనడకన పడ్డాయి. మంత్రుల సమీక్షలు మూలపడ్డాయి. శాఖలపై అజమాయిషీ అదుపు తప్పింది. దీంతో పనులు కావాల్సిన వాళ్లు మంత్రులను ఆశ్రయించకుండా ఐఎఎస్‌ల వద్దకు వెళ్తున్నారు. దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకుందామనుకునే ధోరణి ఐఎఎస్‌లలో పెరిగిపోయింది. దీంతో మంత్రుల పేషీల దగ్గర కంటే ఐఎఎస్‌ల ఛాంబర్ వద్దనే సందర్శకుల రద్దీ ఎక్కువైంది.

## ఇరకాటంలో సిఎం



జగన్ వర్గంలో చేరిన ఎమ్మెల్యేలపై చర్య తీసుకోవాలంటున్న స్వపక్షీయుల డిమాండ్ సిఎం కిరణ్‌కుమార్‌ను ఇరకాటంలో పడేస్తోంది. విజయవాడలో, ఢిల్లీలో జగన్ నిర్వహించిన నిరసన దీక్షలకు హాజరైన కాంగ్రెస్ ఎమ్మెల్యేల్ని వెంటనే పార్టీ నుంచి సస్పెండ్ చేయాలంటూ పలువురు స్వపక్షీయులు సిఎం కిరణ్‌కుమార్‌పై తీవ్ర వత్తిడి తెస్తున్నారు. స్వపక్షీయుల డిమాండ్‌కు తలొగ్గితే ప్రభుత్వం మైనారిటీలో పడుతుంది. అప్పుడు అసలుకే ఎసరు వస్తుంది. దీంతో కిరణ్‌కుమార్ ఎటూచెప్పలేక అంతా అధిష్టానం చూసుకుంటుంది అంటూ దాటేస్తున్నారు.

## జగన్‌పై డేగ కన్ను



జగన్‌పై కాంగ్రెస్ అధిష్టానం డేగ కన్నేసిందా? అవుననే అంటున్నాయి కాంగ్రెస్ వర్గాలు. జగన్ ఇటీవల విజయవాడలో నిర్వహించిన లక్ష్యదీక్ష, తాజాగా ఢిల్లీలో నిర్వహించిన జలదీక్ష విజయవంతం కావడంతో అధిష్టానానికి నిద్రపట్టడం లేదు. దీక్షల పేరుతో జగన్ ఎమ్మెల్యేల బలప్రదర్శనను చేపడ్తుండటం అధిష్టానానికి కలవరం కలిగిస్తోంది. దీంతో అసలు జగన్ వెంట ఎంతమంది ఎమ్మెల్యేలు ఉన్నారంటూ అధిష్టానం ఆరాతీస్తోంది. రాష్ట్ర, కేంద్ర నిఘావర్గాల ద్వారా విశ్వసనీయ సమాచారాన్ని తెప్పించుకుంటోంది. జగన్ బలప్రదర్శన ద్వారా ఏం సాధించాలనుకుంటున్నాడో తెలుసుకోడానికి కాంగ్రెస్ పరిశీలకుడు వీరప్పమొయిలీ హైదరాబాదులో మకాం వేశాడు. జగన్ వర్గీయులుగా ముద్ర వున్న ఎమ్మెల్యేల్ని పిలిపించుకొని దువ్వే కార్యక్రమం కూడా చేపట్టాడు. పాపం! అధిష్టానానికి ఎన్ని కష్టాల్లో!!

## దటీజ్ రోశయ్య



మాజీ ముఖ్యమంత్రి కె.రోశయ్య ఇప్పుడు ఎంతో ఉల్లాసంగా, ఉత్సాహంగా కనిపిస్తున్నాడు. సిఎంగా ఉన్నన్నినాళ్లు తీవ్ర ఒత్తిడికిలోనైన రోశయ్య ఒక్కసారిగా రిలాక్స్ కావడం గాంధీభవన్‌లో హాట్‌టాపిక్‌గా మారింది. పదవి వున్నా లేకున్నా టంచనుగా గాంధీభవన్‌కు హాజరు కావడం రోశయ్య దినకృత్యం. సిఎంగా ఉన్నప్పుడు గాంధీభవన్ హాజరు మిస్సయ్యాడు. సిఎం కుర్చీ ఖాళీ చేయడంతో ఇప్పుడు తిరిగి గాంధీభవన్‌కు క్రమం తప్పకుండా హాజరవుతున్నాడు. గాంధీభవన్‌లో తనను కలిసే విలేకరులకు 'టీ' తాగించడం రోశయ్యకు అలవాటు. సిఎంగా ఉన్నప్పుడు రోశయ్య 'టీ'కి దూరమైన విలేకరులకు ఇప్పుడు ఆ కొరత తీరింది. దీంతో వెల్‌కమ్ అంటూ విలేకరులు రోశయ్యను గాంధీభవన్‌కు ఆహ్వానిస్తున్నారు. రోశయ్య కూడా 'అలాగే' అంటూ విలేకరులతో 'టీ' తాగుతూ కులాసా కబుర్లు చెబుతున్నాడు. దటీజ్ రోశయ్య.

# వారఫలాలు

*తేది 15–1–2011 నుండి 21–1–2011 వరకు మకరంలో రవి, కుజులు; ధనుస్సులో బుధ, రాహువులు; వృశ్చికంలో శుక్రుడు; మీనంలో గురువు; కన్యలో శని; మిథునంలో కేతువు; మేష, వృషభ, మిథున, కర్కాటకాల్లో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

సంతాన మూలంగా ఉత్సాహకరమైన వార్త వింటారు. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. ధనాదాయ విషయంలో లోటుండదు. పురోభివృద్ధి అన్ని రంగాలలో ఉంటుంది. రాజకీయులకు అత్యంత అనుకూలమైన కాలం. విద్యార్థులకు మంచికాలం. వ్యాపారులు మంచి లాభాలనార్జిస్తారు. స్పెక్యులేషన్ లాభిస్తుంది. ఉద్యోగులు ప్రోత్సాహకరమైన వార్త వింటారు. నూతన వస్త్రాభరణాలు కొంటారు.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ముందుచూపుతో అడుగేయాలి. ప్రతి విషయంలో ఎదుటివారు తప్పుగా అంచనా వేస్తారు. ఆర్థిక విషయాలు అంతంత మాత్రమే. నరాలకు సంబంధించిన బాధలధికం. సంతానమూలంగా మానసిక వేదనకు గురౌవుతారు. ప్రయాణాలు కోరినరీతిలో జరగవు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు తీరని వేదన చోటు చేసుకొంటుంది.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

ఆహార విషయంలో జాగ్రత్త. అభిప్రాయ భేదాలు రాకుండా చూసుకోవాలి. ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి ఉంటుంది. శత్రువులు లొంగి నడచుకొంటారు. అనుకొన్నపనులన్నీ అనుకొన్నరీతిలో ప్రణాళికాబద్ధంగా జరుపుకున్నా ఏదో లోపం ఉన్నట్టు తోస్తుంది. వ్యాపారులకు అంత యోగదాయకమైన కాలం కాదు. ఆరోగ్యవిషయంలో జాగ్రత్త. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

ఎదుటి వ్యక్తి అభిప్రాయాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవాలి. ధనవిషయంలో కటకట తొలగవచ్చు. వ్యాపారులకు గడచిన వారంలో కన్నా ఈ వారం కొంత మేలు. అప్పులు తీరుతాయి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. ఇంటిలో వివాహ సంబంధ విషయాలు ప్రస్తావనకు వస్తాయి. రాజకీయులకు దురదృష్టకాలం. గృహిణులు అనుకొన్న రీతిలో హాయిగా కాలక్షేపం చేస్తారు.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

విరోధులు తగ్గుముఖం పడతారు. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా ఉంటాయి. ఇన్నాళ్ళు ఆటంకాలతో అడ్డపడ్డ పనులు ఊపందుకొంటాయి. నూతన ఉద్యోగావకాశాలు లభించవచ్చు. గడచినకాలం కన్నా మేలైన కాలం. వ్యాపారులకు ప్రోత్సాహకరమైన వారం. రాజకీయులకు ప్రోత్సాహం తక్కువ.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

నూతన వస్త్రాభరణాలు కొంటారు. కొంత ప్రయత్నం తర్వాతనే పనులు సాగుతాయి. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. బయటవారి కోసం ఖర్చు చేస్తారు. ఆర్థికవిషయాలు నెమ్మదిగా చక్కగా సాగుతాయి. ప్రతి పనిలో దూకుడు వద్దు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు. వ్యాపారులకు అత్యంతం చక్కని కాలం.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

పైవారితో అభిప్రాయభేదాలున్నా బయటపడనీయవద్దు. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. మార్పులు, చేర్పులు, కూర్పులు జరగవచ్చు. ఓపిక అవసరం. వివాహాది శుభ కార్యప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. విద్యార్థులు ప్రయోజకులౌతారు. బాధాదాయకమైన ఊహలకు గురి కావద్దు. రాజకీయులకు బాగా సాగుతుంది. నూతన పరిచయాలు సత్ఫలితాలనిస్తాయి.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

పాదాలకు గాయాలు తగిలే అవకాశం. ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అవసరం. మిత్రులమూలంగా మేలు. ధన విషయాలలో లోటు లేదు. వివిధమార్గాలలో ధనప్రాప్తి అవకాశాలు. ఆగిన పనులు నిదానంగా సాగుతాయి. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. వివాహాది శుభకార్యాచరణకు నాంది పలుకుతారు. మాట నిలబెట్టుకోవడానికి శ్రమపడతారు. రాజకీయులకు ఉత్తమకాలం.



**ధనస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

ఇల్లుమార్పిడి, స్థలమార్పిడుల గురించి చింతిస్తారు. ఇంటికి సంబంధించి దుబారా ఖర్చు చేస్తారు. దూరప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. మనశ్శాంతికై దేవాలయాలకు వెళతారు. వివిధమార్గాలలో ధనప్రాప్తి. అనుకూల వాతావరణం. సోదరుల తోడ్పాటు చక్కగా ఉంటుంది. వృత్తి, వ్యాపారాలలో పురోభివృద్ధి చక్కగా ఉంటుంది. చిన్న చిన్న విరోధాలు మనశ్శాంతిని చెడగొడతాయి.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

భగవదారాధన వైపు మనసు పోనిస్తారు. పురోభివృద్ధికి సహాయ సహకారాలందించే వారితో మైత్రి ఏర్పడుతుంది. సంతాన కారణంగా మనశ్చింత. మిత్రులతో కలసి వినోదయాత్రలు చేసే అవకాశాలున్నాయి. వ్యాపార విస్తరణకు నూతన ప్రయత్నాలు చేస్తారు. నూతన విషయావగాహనకై యావ. వృత్తి ఉద్యోగాల్లో కోరుకొన్న మార్పులు చేర్పులు జరిగే సూచనలు. ఆరోగ్యం చక్కగా ఉంటుంది.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

విందు వినోదాలలో ముఖ్యపాత్ర వహిస్తారు. చాలకాలంగా ప్రయత్నిస్తూ వచ్చిన పనులు ఈనాడు ఫలోన్ముఖమవుతాయి. పురప్రముఖుల పరిచయం ఆనందాన్నిస్తుంది. మనశ్చాంచల్యం ఉంటుంది. విశ్రాంతి తక్కువ. జాయింటు వ్యవహారాలు చక్కదిద్దుకొంటాయి. ఆకస్మిక సంఘటనలకు అవకాశాలున్నాయి. ఇంటిలో ఆనందదాయకమైన పరిస్థితులు చోటు చేసుకొంటాయి.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. ఆప్తుల, విజ్ఞుల సలహాలు తీసుకోవాలి. అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాములవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. పనివారితో కఠినంగా మాట్లాడవద్దు. రాజకీయులు తోటివారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించాలి. విద్యార్థులు కఠినంగా శ్రమించాలి.

## పంచాంగం

15తేది సంక్రాంతి పండుగ.

16తేది కనుమ పండుగ.

**శుభ ముహూర్తాలు లేవు**

**జనవరి తిథులు**

**పుష్య శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 15 | శని | దశమి | ఉ.8.42 | గం.ల.వ |
| 16 | ఆది | ఏకాదశి | ఉ.8.58 | గం.ల.వ |
| 17 | సోమ | ద్వాదశి | ఉ.8.27 | గం.ల.వ |
| 18 | మంగళ | త్రయోదశి | ఉ.7.11 | గం.ల.వ |
| | | చతుర్దశి | తె.5.15 | గం.ల.వ |
| 19 | బుధ | పౌర్ణమి | రా.6.01 | గం.ల.వ |

**పుష్య బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 20 | గురు | పాడ్యమి | రా.11.58 | గం.ల.వ |
| 21 | శుక్ర | విదియ | రా.8.54 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com

# మూలలు, కోణాలు తిరిగిన స్థలాలు వాస్తు 'నిషిద్ధాలు'!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎన్.కె.తులసీరామం — తిరుపతి*

** కొన్ని స్థలాలు, నిర్మాణాలు దిక్కులను గాక మూలల్ని చూస్తుంటాయా? అలాంటివి కొనవచ్చా?*

అలాంటివి 'కుటుంబ వేధను' కలిగిస్తాయి. ఆర్థిక బాధలు విపరీతం. అందువల్ల కొనడం నిషిద్ధం.

*టి.హనుమంతరావు — సూళ్లూరుపేట*

** ఎదురింటి, ప్రక్కింటి మూలాలు మా యింటికి తగులుతున్నాయి.*

దీన్ని కోణవేధ అంటారు. అట్లా వుంటే మీ యింటి మూలాల్ని గుండ్రంగా మలుచుకోండి. దృష్టి, కోణ వేధలు తప్పుతాయి.

*కాళింపల్లి శ్రీదేవి — నాయుడుపేట*

** ఆర్థిక, అనారోగ్య సమస్యలున్నాయి. ప్లాను పంపిస్తున్నాను.*

ప్లానులో దక్షిణ దోషం వుంది. గేటు తూర్పు ఈశాన్యానికి మార్చండి. సమస్యలు ఉధృతంగా వున్నాయి కాబట్టి 'లక్ష్మీకృత వాస్తు యంత్రం' ప్రతిష్టించుకోండి.

*ఎం.రామ్మూర్తినాయుడు — తిరుపతి*

** లే అవుట్‌లో అన్నీ మూలలకు త్రిప్పిన ప్లాట్లున్నాయి. అవి కొనవచ్చా?*

మూలలకున్న స్థలాలు 'కోణవేధ'ను కలుగజేస్తాయి. స్థలం దిక్కులకుగాక కోణాలకు తిరిగి వుండడం వల్ల స్థలం ఖరీదు చేయనక్కర లేదు.

*నైనం గీతాలక్ష్మి — గుంటూరు*

** భార్యాభర్తలపై వివాహ ముహూర్త బలమే కదా ప్రభావం చూపిస్తుంది.*

అని మీరనుకుంటే ఎలా? జాతక బలాలే ముఖ్యం. ముహూర్తబలాలు వివాహ ప్రక్రియకు సంబంధించినవి. కళ్యాణ మండపాల ప్రభావం కూడా వుంటుంది. అయితే అది మూడు సంవత్సరాలు మాత్రమే.

*ఇరివెంట రామలక్ష్మి — హైదరాబాద్*

** తూర్పు ప్లాటు అయినా మంచి ఫలితాలేవీ కలగడం లేదు.*

అపార్టుమెంటు రాజవీధి పశ్చిమం, ప్లాట్లు తూర్పు పడమరలుగా కట్టారు. అన్నీ పశ్చిమ ఫలితాల్నేయిస్తాయి. తూర్పు ఫలితాల్నివ్వవు.

*ఆర్వేల జమదగ్నిశర్మ — చెన్నై*

** 'అగ్ని' గురించి మయవాస్తులో చెప్పారంటారు నిజమేనా?*

దుర్నిరీక్షుడైన శివుడి త్రినేత్రం, భూమిలో 'లావా', సముద్రంలో 'బడబానలం', పృధ్వికి సూర్యుడు. అగ్నిలేని స్థానం, శివతత్వంలేని స్థలం లేదంటుంది 'మయవాస్తు'!

*పి.సూర్యకుమారి — చిత్తూరు*

** అపార్టుమెంట్లలో వాస్తు లేదంటారు. ఎందుచేత?*

బిల్డర్స్‌కు వాస్తు పట్ల శ్రద్ధ లేకపోవడం, వాస్తు ప్రకారం కడితే రెండు, మూడు ప్లాటు నష్టపోవలసి వుంటుంది.

*చిగురు జానకిరాయశర్మ — చెన్నై*

** ఈశాన్య 'కుంభ ప్రతిష్ట' జనంలో బాగా ప్రచారంలో వుంది. మంచిదేనా?*

అనారోగ్యాలు, కుటుంబ కలహాలు, ఆర్థిక నష్టాలు వున్న యింటికి 'కుంభ ప్రతిష్ట' మంచిదే. అయితే ప్రతిష్ట పద్ధతులు తెలిసిన సిద్ధాంతులు చాలా తక్కువ. అంచేత 'యంత్ర ప్రతిష్ట' చేసుకోవడం మేలు.

*కె.శైలజానాథ్ — సికింద్రాబాద్*

** ఇంటి వాస్తు బాగానే వుంది. వీధుల ప్రభావాలేమైనా వుంటాయా?*

మీరు మరో ప్రాంతానికి గృహాన్ని మార్చకపోతే మీ పరిస్థితిలో మార్పు వుండదు.

*పైడిపాల శేషగిరిరావు — తిరుపతి*

** యంత్రాలు, గోళాలు ఇవన్నీ శాస్త్రాల్లో చెప్పారా?*

'గోళాల్ని' గురించి ఏ వాస్తు సారస్వతమూ పేర్కొనలేదు. ఇరవై ఎనిమిది వాస్తు శాస్త్రాల్లోనూ 'యంత్ర' సారస్వతం వుంది.

# నెల్లూరులో నత్తనడకన రోడ్ల నిర్మాణపు పనులు!

నగరంలో ఆరు రోడ్ల నిర్మాణానికి మునిసిపల్ శాఖ 15 కోట్ల రూపాయలు మంజూరు చేసినా ఈ పనులను త్వరితగతిన పూర్తి చేయడంలో కార్పొరేషన్ అధికార గణం వైఫల్యం చెందింది.



చిల్డ్రన్స్‌పార్కు వద్ద రోడ్డు నిర్మాణంలో భాగంగా నిదానంగా నడుస్తున్న డ్రైన్ పనులు.

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలోని పలు రోడ్ల నిర్మాణ పనులు నత్తనడకన జరుగుతున్నాయి. నగరంలో దెబ్బతిన్న రోడ్లను వెంటనే తిరిగి నిర్మించాలన్న లక్ష్యంతో రాష్ట్ర మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ కార్యాలయం ప్రత్యేక నిధులు విడుదల చేయడం జరిగింది. నగరంలో ఆరు పనులకు దాదాపు 15 కోట్ల రూపాయలకు పైగా నిధులు విడుదలయ్యాయి. విడుదలైన నిధులతో పనులు పూర్తి చేయించాల్సిన ఇంజినీరింగ్ విభాగం అధికారులు వుదాసీనంగా వ్యవహరిస్తున్నారు.

మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలో రామలింగాపురం కూడలి నుంచి చిల్డ్రన్స్‌పార్కు మీదుగా జాతీయ రహదారి వరకు సిమెంటురోడ్డు నిర్మాణం కోసం 7కోట్ల 41లక్షల రూపాయలు విడుదలయ్యాయి. చిల్డ్రన్స్ పార్కు రోడ్డు నుంచి అపోలో ఆసుపత్రి మీదుగా ముత్తుకూరు రోడ్డును కలిపే విధంగా తారురోడ్డు నిర్మాణం కోసం 42లక్షల 50వేల రూపాయలు, కొండాయపాళెం రైల్వేగేటు నుంచి వనంతోపు మీదుగా పాత కొండాయపాళెం వరకు, పడారుపల్లి నుంచి జాతీయ రహదారి వరకు, మైపాడు గేటు నుంచి ఆర్‌సిసి ఫ్యాక్టరీ మీదుగా జాతీయ రహదారి వరకు తారురోడ్ల నిర్మాణాలు చేపట్టాల్సి వుంది. ఆరు పనులకు గాను బాలాజీనగర్ నుంచి జాతీయ రహదారి వరకు చేపడుతున్నా ఒక్క తారురోడ్డు నిర్మాణం మాత్రమే పూర్తయ్యింది.

మిగిలిన ఐదు పనులలో చిల్డ్రన్స్‌పార్కు నుంచి జాతీయ రహదారి వరకు నిర్మించాల్సిన సిమెంటు రోడ్డు పనులు ప్రారంభమై నెలలు గడుస్తున్నా ఇంకా కల్వర్టులు, డ్రైనేజీ కాల్వల పనులు పూర్తి కాలేదు. కొండాయపాళెం రైల్వేగేటు నుంచి పాత కొండాయపాళెం వరకు చేపట్టాల్సిన తారు రోడ్డు పనులు అసలు ప్రారంభం కాలేదు. ఉమ్మారెడ్డిగుంట నుంచి మినీబైపాస్ రోడ్డుకు వెళ్లే మార్గం చాలా అధ్వాన్నంగా తయారై వుంది. పై ఆరు పనులలో నాలుగు పనులను నగర ఎమ్మెల్యే బంధువైన శ్రీహరిరెడ్డి దక్కించుకోగా, మిగిలిన రెండు పనులను రూరల్ ఎమ్మెల్యే అనుచరులు దక్కించుకున్నారు.

2010 సంవత్సరం ఆగస్టు నెలలోనే రోడ్ల నిర్మాణాలకు టెండర్లు ఖరారైనప్పటికి కాంట్రాక్టర్లు, అధికారపార్టీకి చెందిన నేతల మధ్య అవగాహన కుదరకపోవడంతో పనులు ప్రారంభానికి నోచుకోలేకపోయాయి. దాదాపు 15 కోట్ల రూపాయల విలువ చేసే పనులు దక్కించుకున్న కాంట్రాక్టర్లు అధికార పార్టీకి చెందిన నేతలకు కమీషన్లు ఇవ్వాల్సి రావడంతో కొంత ఆలస్యం జరిగిందన్నది వాస్తవం. కమీషన్లు ఇవ్వలేని పక్షంలో వీరి పేర్ల మీదనే అధికారపార్టీకి చెందిన ప్రజాప్రతినిధులు పనులు చేయాలని కూడా నిర్ణయించారు. మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు తమాషా చూస్తున్నారే తప్ప, పనులు పూర్తి చేయించేందుకు మాత్రం చొరవ చూపడం లేదన్న విమర్శలు వున్నాయి.

ప్రజా ప్రతినిధులు, అధికారులు, కాంట్రాక్టర్లు వ్యవహరిస్తున్న తీరుతో నగర ప్రజలు ఇబ్బందిపడక తప్పడం లేదు. ఇప్పటికే బాలాజీనగర్ నుంచి జాతీయ రహదారి వరకు వేసిన తారురోడ్డు నిర్మాణంలో నాణ్యతా ప్రమాణాలు పాటించలేదన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి. ప్రస్తుతం చేపట్టే పనులలోనైనా నాణ్యతా ప్రమాణాలు పాటిస్తారో లేదో అధికారులకే తెలియాలి. ఇప్పటికైనా అధికారులు స్పందించి కోట్ల రూపాయలు వ్యయంచేసి నిర్మిస్తున్న రోడ్ల పనులను సకాలంలో పూర్తి చేయాల్సిన అవసరం వుంది.

కుంభకోణాలు

# ఆర్థిక మండళ్ల వెనుక అక్రమాలు!

జిల్లాలో వివిధ ప్రాంతాల్లో ప్రత్యేక ఆర్థిక మండళ్ల ఏర్పాటుకు సేకరించిన భూములకు చెల్లించిన పరిహారంలో లక్షలాది రూపాయలు దుర్వినియోగమయ్యాయి. అర్హులైన రైతులకు పరిహారం అందించకుండా బినామీలకు పరిహారం అందించారన్న విషయంపై రాష్ట్ర ప్రభుత్వానికి పలు ఫిర్యాదులు వెళ్లాయి. ఈ ఫిర్యాదులపై స్పందించిన రాష్ట్ర ప్రభుత్వం పూర్తిస్థాయిలో విచారణ జరపాలని అవినీతి నిరోధక శాఖ అధికారులను ఆదేశించడం జరిగింది. ప్రభుత్వ ఉత్తర్వులతో రంగంలోకి దిగిన ఎసిబి అధికారులు విచారణలో వెలుగుచూసిన వాస్తవాలపై ఆశ్చర్యపోవాల్సి వచ్చింది.

ప్రధానంగా గూడూరు డివిజన్‌లో పరిశ్రమల ఏర్పాటుకోసం భూములు కోల్పోయిన రైతులు ఎసిబి అధికారుల విచారణకు హాజరై పరిహారం ఎంత అందించారో, బినామీలు రంగప్రవేశం చేసి పరిహారం సొమ్మును ఎలా స్వాహా చేశారో సమగ్రంగా వివరించారు. అప్పటి గూడూరు ఆర్డీఓ పరిహారం పంపిణీలో పలు అక్రమాలకు పాల్పడ్డారన్న ఆరోపణలు వచ్చాయి. ఎసిబి అధికారుల విచారణలో కూడా ఆర్డీఓపై అభియోగాలు రావడంతో కేసు నమోదు చేశారు. ఆర్డీఓతోపాటు చిల్లకూరు మండలంలోని పలు గ్రామాలకు చెందిన దళారులపై కూడా కేసులు నమోదయ్యాయి. ఈ క్రమంలో గూడూరు ఆర్డీఓను రాష్ట్ర ప్రభుత్వం బదలీ చేయడం విశేషం.

అప్పుడు విచారణాధికారిగా వున్న ఎసిబి ఇన్స్‌పెక్టర్‌ను ఆశాఖ ఉన్నతాధికారులు బదలీ చేశారు. దీంతో సెజ్‌ల పరిహారం పంపిణీలో రాజకీయ జోక్యం ఏర్పడిందన్న ఆరోపణలు కూడా వచ్చాయి. ఈ ఆరోపణలను ఆ శాఖాధికారులు కొట్టిపారేస్తూ సకాలంలో బాధ్యులపై కేసులు నమోదు చేయడంతో ఇన్స్‌పెక్టర్ నిర్లక్ష్యం చేశాడన్న దానిపై ఇతర ప్రాంతాలకు బదలీచేశామని వివరణ ఇచ్చుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. ప్రస్తుతం సెజ్ భూములపై విచారణ బాధ్యతలు హైదరాబాద్‌కు చెందిన ఎసిబి అధికారులు చేస్తున్నారు. వీరు అప్పుడప్పుడు నెల్లూరు వచ్చి విచారణ చేసి వెళ్తుంటారు.

సెజ్‌లకు కేటాయించిన భూముల వ్యవహారంలో పెద్ద ఎత్తున అవకతవకలు జరిగాయని ఎసిబి ఇన్స్‌పెక్టర్‌గా వ్యవహరించిన జయచంద్రరాజు కర్నూలు జిల్లా నుంచి నెల్లూరుజిల్లా వరకు చేపట్టిన పాదయాత్ర రాష్ట్రంలో సంచలనం సృష్టించింది. ఒక ఇన్స్‌పెక్టర్ తన ఉద్యోగానికి రాజీనామా చేసి ఈ విధమైన పాదయాత్ర జరపడం రాష్ట్రంలో ఇదే తొలిసారి. ఈ పాపం వెనుక పెద్దల హస్తం వుండబట్టే ఈ విషయంపై కూడా విచారణ లేకుండా మరుగుపరిచేశారు.




వివాదాస్పదమైన కపారో ఇండస్ట్రియల్ పార్క్‌కు కేటాయించిన స్థలాలు.

# బ్రోకర్‌కు పేరే శాపం!



అల్లూరు రహీం

సంగీత దర్శకుడు ఆర్పీ పట్నాయక్ దర్శకునిగా మారి తీసిన ద్వితీయ చిత్రమే బ్రోకర్. ఈ చిత్రాన్ని నెల్లూరీయుడు మద్దినేని రమేష్ నిర్మించాడు. అవినీతి విశ్వజనీయమైన ఈ రోజుల్లో అవసరానికి అవకాశానికి వారధిగా వ్యవహరించే బ్రోకర్‌ను ఈ చిత్రంలో హీరోగా ఎంచుకొన్నాడు. ఇతడు ఎంత కష్టమైన పనికైనా సులువైన పరిష్కారం చూపుతాడు. దీనికోసం ఎంతకైనా దిగజారుతాడు. కాని చిత్రం చివరన అతనిలో వచ్చిన మార్పు వ్యవస్థలో మార్పుకు నాంది పలుకుతుంది. అవినీతిరహిత సమాజానికి బాటలు పరుస్తుంది. వాస్తవానికి దేశంలో అవినీతి, లంచగొండితనం, దోపిడీలు అంతమయ్యే అవకాశాలు కనుచూపు మేరలో కనపడడం లేదు. కాని నిర్మాత రమేష్ ధైర్యం చేసి ఒకమంచి సందేశంతో ఈ సినిమాను తీశాడు. అయితే ఆయన చేసిన తప్పల్లా బ్రోకర్‌కు దర్శకునిగా ఆర్పీ పట్నాయక్‌ను ఎంచుకోవడం. ఆర్పీకి ఒక దురలవాటు వుంది. ఆయన సంగీత దర్శకత్వం వహించే చిత్రాల్లో ఎక్కువ పాటలు ఆయనే పాడుకొంటాడు. బ్రోకర్ సినిమాకు కథ, స్క్రీన్‌ప్లే, సంగీత, దర్శకత్వ బాధ్యతలకు తోడు హీరో పాత్ర కూడా ఆయనే పోషించాడు. కాని ఈ బాధ్యతలన్నీ నెరవేర్చే శక్తి లేకపోవడం వల్ల బ్రోకర్ ఓ డాక్యుమెంటరీ చిత్రం తరహాలో నడిపాడాయన.

ఈ చిత్రంలో గొప్పగా చెప్పుకోవాల్సింది సీనియర్ మాటల రచయిత ఎంవిఎస్.హరనాథరావు వ్రాసిన మాటలు. భక్తి, పాపం రెండు సమానంగా పెరుగుతున్నాయి. రాజ్యాంగాన్ని మార్చాం... రికార్డులు మార్చలేమా? తీవ్రవాదులు, ఉగ్రవాదులు, రాజకీయ నాయకులకన్నా ప్రమాదకరమైన వాళ్లు మౌనంగా అన్నీ చూస్తుండే జనం. బాధలో వున్నప్పుడు మందు తీసుకో... నిర్ణయాలు తీసుకోకూడదు. దేవుళ్లు వుండేది పాపాలు కడిగేందుకు. వీక్‌నెస్ తెలిస్తే వీక్ చేయడం ఎంత? మరణం – మార్పు సడన్‌గా జరుగుతాయి ఈ కోవలోనివే. చైతన్యప్రసాద్ వ్రాసిన మూడు పాటల్లో టైటిల్ సాంగ్‌గా వచ్చే పురుడుపోస్తే లంచం బాగుంది. ఐటమ్ గర్ల్ కౌష పాట దులపకే పిల్లా పెద్దగా ఆకట్టుకోలేదు. కుక్కతోక వంకర పాటైతే గందరగోళంగా వుంది. చాలారోజుల తర్వాత తెరపై కనిపించిన గొల్లపూడి మారుతీరావు రిటైర్డ్ ఉపాధ్యాయుడు పాత్రలో అదరగొట్టేశాడు.

చిత్ర సమీక్ష

ఇక చిత్రకథలోనికి వెళ్తే హైదరాబాద్‌లో పవర్‌ఫుల్ బ్రోకర్ గణపతి (ఆర్పీ పట్నాయక్) తలచుకొంటే సెక్రటరియేట్, మంత్రుల లాబీల్లో జరగని పని లేదు. అతను ఫోన్ చేస్తే ముఖ్యమంత్రి (ఎంవిఎస్.హరనాథరావు), రాష్ట్రమంత్రి (కోట శ్రీనివాసరావు) తక్షణం ఎత్తుకొంటారు. రాష్ట్ర మంత్రిగారైతే తన పేషీకి ఆయనను పిలిపించి డీల్స్ చేస్తుంటాడు. గణపతి శక్తి తెలియడం వల్ల రాష్ట్ర వ్యాప్తంగా ఆయన ఒక ప్రత్యేక బ్రోకర్ అవతారమెత్తుతాడు. ఐఎఎస్ అధికారి ధర్మతేజ(శ్రీహరి) ఇంటిపై ఎసిబి అధికారులు దాడులు చేస్తే ఆ కేసు నుంచి అతనికి విముక్తి కల్గిస్తాడు. పెండింగ్‌లో పెట్టిన ఫ్లైఓవర్ బ్రిడ్జి ఫైలును కదలించి కాంట్రాక్టర్ (చలపతిరావు) దగ్గర పెద్ద మొత్తంలో ముడుపులు అందుకొంటాడు. గణపతి భార్య శ్రుతి (మయూరి) ఈ అవినీతి సంపాదన వద్దంటుంది. ఓ రోజు కళామందిర్‌లో వస్త్రాలు కొనను ఈ దంపతులిద్దరూ తమ ఏకైక కుమారునితో కలసి వెళ్తారు. ఆ ఫ్లైఓవర్ ఆ బిడ్డపై కూలిపోవడంతో ప్రాణాలు కోల్పోతాడు. ఈ కేసు కూడా కాంట్రాక్టర్‌పై పెట్టకుండా బ్రోకరిజం చేస్తాడు గణపతి. అయితే ఎసిబికి పట్టుబడిన ఐఎఎస్ అధికారి చేసిన హితబోధ గణపతిలో విపరీతమైన మార్పు తెస్తుంది. టీవీ–9తో కలసి స్టింగ్ ఆపరేషన్‌లో భాగంగా రాష్ట్రంలోని అవినీతిపరుల చరిత్రలు ఒకటి రెండు లైవ్ ద్వారా బట్టబయలు చేస్తాడు. ఈ సందర్భంగా టీవీ–9 సిఇఓ సూర్యప్రకాష్ (సురేష్) ఇచ్చే సందేశానికి రాష్ట్రంలోని అవినీతిపరులైన అధికారుల గుండెల్లో రైళ్లు పరుగెత్తి ఎవరికివారు తమ అవినీతి చరిత్రలను బట్టబయలు చేస్తారు. ముఖ్యమంత్రి (ఎవిఎస్.హరనాథరావు) ఈ కార్యక్రమం జరుగుతుండగా పెట్టే విలేకరుల సమావేశంలో నక్సలైట్లకు క్షమాభిక్ష పెట్టినట్లు, మారిన అవినీతి అధికారులకు వుద్యోగంలో కొనసాగే వుత్తర్వులిస్తాడు. అవినీతిరహిత సమాజ స్థాపనకు అందరూ కృషి చేయాలన్న సందేశం సిఎం ఇవ్వడంతో చిత్రం ముగుస్తుంది. చిత్రంలో ప్రధానపాత్ర అయిన బ్రోకర్‌గా ఆర్పీ పట్నాయక్ నటన చెప్పుకోతగ్గట్లు లేదు. శ్రీహరి, కోట శ్రీనివాసరావు, వేద, మయూరి, అనంత్, డాక్టర్ భరత్‌రెడ్డిల నుంచి కూడా ప్రతిభావంతమైన నటనను రాబట్టుకోలేకపోయాడు. కాని నేటి అవినీతి సమాజాన్ని మార్చను ఇటువంటి చిత్రాలు ఎన్నో రావాల్సిన అవసరం వున్న దృష్ట్యా ప్రేక్షకులు బ్రోకర్‌ను చూడాల్సిందే. బ్రోకర్ పేరును చూసి మహిళా ప్రేక్షకులు థియేటర్ల దగ్గర కనపడడం లేదు. కాని ఈ చిత్రంలో అశ్లీలత లేదు.



## నేను అందగత్తెను కాదు



హాటెస్ట్ వుమెన్, సెక్సియస్ట్ వుమెన్ కీర్తి కిరీటాలు దక్కించుకొన్న హీరోయిన్ కత్రినా కైఫ్ తాను పెద్ద అందగత్తెనే కాదంటుంది. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ నా 18 సంవత్సరంలో సినీ పరిశ్రమకు పరిచయమయ్యాను. అంతకు ముందు 15, 16, 17 ఏళ్లలో వున్నప్పుడు కుర్రాళ్లు నా వైపు చూడలేదంటే నమ్మగలరా? నేనేమి అంత అందగత్తెను కాదని అప్పుడే నిర్ణయించుకొన్నాను. కానీ ఇంటర్నెట్‌లు, మ్యాగజైన్‌లు నిర్వహించిన సర్వేల్లో నన్ను సెక్సియస్ట్, హాటెస్ట్ ఉమన్ అంటూ అధిక మొత్తంలో అభిమానులు ఓటేస్తున్నారంటే అదంతా నా అదృష్టంగా భావిస్తున్నానంది.

## పిచ్చి భయాలు లేవు!



చంద్రముఖికి స్వీకెల్‌గా తీసిన నాగవల్లి కన్నడ చిత్రంలో నటించిన సూపర్‌స్టార్ విష్ణువర్ధన్ చనిపోవడం, తమిళ సూపర్‌స్టార్ రజనీకాంత్ ఈ చిత్రంలో నటించడానికి ఒప్పుకోకపోవడంతో పలు కథలు ప్రచారంలోకి వచ్చాయి. ఈ విషయాన్ని హీరో వెంకటేష్ వద్ద ప్రస్తావిస్తే నాగవల్లిలో నటించడానికి మీకు భయమేయలేదా అని చాలామంది అడిగారు. భయమంటే ఏమిటో నాకు తెలియదు. శరీరానికి విలువ ఇచ్చినపుడు భయం వేస్తుంది. మనసులో గట్టి సంకల్పం వుంటే భయం మన దగ్గరకు కూడా రాదు. దేవుడు మన మధ్య వున్నట్లు దయ్యాలు వున్నాయి. కష్టాల్లో వున్నవాడిని ఆదుకొనే ప్రతి ఒక్కరు దేవుడే. మనసుని దేవాలయంగా చేసుకొంటే ఎలాంటి సమస్య దరిచేరదు. ప్రశాంతంగా బతకొచ్చు. లేకపోతే నిత్యం గందరగోళమేనని తనదైన ధోరణిలో చెప్పుకొచ్చారాయన.

## సవాల్ విసిరే పాత్రలిష్టం!



బొమ్మరిల్లు చిత్రం హీరోయిన్ జెనీలియాను జాతీయస్థాయిలో గొప్ప హీరోయన్‌గా నిలబెట్టింది. ఈ చిత్రం హిందీ, తమిళ, బెంగాలీ రీమేక్‌లలో ఆమె హీరోయిన్‌గా నటించింది. గడచిన ఏడాదిలో విడుదలైన 'ఆరెంజ్' చిత్రం ప్రేక్షకులకు ఎందుకు నచ్చలేదో తనకు తెలియడం లేదంటుందీ భామ. నేనేదో గొప్ప నటిని అనే భావన నాలో ఎప్పుడూ లేదు. నేనొక సినిమాలో బాగా నటించానంటే అదంతా దర్శకుల ప్రతిభ కావచ్చు. లేదంటే కథలో నా పాత్రలో వున్న బలమో కావచ్చు. సవాల్ విసిరే పాత్రలంటే నాకిష్టం. 'కథ' చిత్రం అటువంటిదే. అయితే కొత్తదనం వైపు అడుగులు వేస్తున్నప్పుడు ప్రతిసారీ విజయమే దక్కాలనుకొంటే కుదరదంది.

## రిచాలో మరో కళ!



అమెరికా నుంచి వచ్చిన హీరోయిన్ లీడర్ ఫేం రిచా గంగోపాధ్యాయ 2010 తనకు బాగా కలిసొచ్చిందంటుంది. గడచిన ఏడాది తాను నాగవల్లి, మిరపకాయ్ చిత్రాల్లో నటించానని చెప్పింది. నాగవల్లి చిత్రాన్ని చూసి కుటుంబ సభ్యులు అభినందించారంటుంది. హోమ్‌సైన్స్‌లో డిగ్రీ పూర్తి చేశాక సినిమాల్లో నటిస్తానంటే ఇంట్లోవాళ్లు ఒప్పుకోలేదు. పట్టుబట్టి అనుపమ్ ఖేర్ స్కూల్‌లో చేరి నటనలో పాఠాలు నేర్చుకొన్నాను. అవి నాగవల్లిలో బాగా వుపయోగపడ్డాయి. నాకు నటనే కాదు శాస్త్రీయ సంగీతంలోనూ ప్రవేశముంది. కీర్తనలు గట్రా చక్కగా పాడుతాను. ఎవరైనా ఛాన్స్ ఇస్తే గాయనిగా కూడా నన్ను నేను నిరూపించుకొంటానంటుంది. అయినా రెండు పడవలపై ప్రయాణమెందుకు రిచా?

## ముంబాయిపై మోజు లేదు!



ప్రాంతీయ భాషా సినిమాల తర్వాతమెట్టు బాలీవుడ్‌గా భావిస్తారు హీరోయిన్లు. ఎంతో మంది దక్షిణాది భామలు హిందీ సినిమా గడప తొక్కారు కూడా. అయితే అక్కడ గెలిచినవాళ్లు కొంతమందే. బాలీవుడ్ లంపటంలోనికి తాను పోనంటుంది రెండేళ్ల నుంచి తెలుగులో నెంబర్ వన్ స్థానంలో వున్న హీరోయిన్ అనుష్క. తమిళంలోనూ తన హవాను కొనసాగిస్తున్నా ఈ భామ తెలుగులో నాగార్జున సరసన ఢమరుకం, ప్రభాస్ సరసన రెబల్ చిత్రాల్లో హీరోయిన్‌గా నటిస్తుంది. తమిళంలోనూ పలు చిత్రాల్లో ఈమె నటిస్తుంది. బాలీవుడ్‌కు వెళ్తారా అని ఈమెను ప్రశ్నిస్తే హిందీ సినిమాలపై మోజు లేదంది. కొన్ని అవకాశాలు వచ్చాయి. కుదరదన్నాను. నాకేం హిందీ సినిమాల్లో వెలిగిపోవాలనే ఆశలేదు. నాకు దక్షిణాది చిత్రాలంటేనే ఇష్టం. ఇక్కడ నాకు సౌకర్యంగా వుంటుంది. ఇంత సౌలభ్యం వదలుకొని అక్కడకు వెళ్లి అవస్థలు పడడం ఎందుకని తేల్చి చెప్పింది అనుష్క.

# మార్కెట్ రౌడీల దెబ్బకు బిత్తరపోయిన డిఎస్ఓ!

**జనమెంత మోసపోతున్నారో అర్థమయ్యిందా సారూ!**

అధికారులు పలుమార్లు దాడి చేసినా, కేసులు పెడుతున్నా కూరగాయల మార్కెట్‌లో పరిస్థితులు మెరుగుపడడం లేదు. కొనుగోలుదారులతో ఇష్టానుసారంగా వ్యవహరించడం, తూకాల్లో అక్రమాలకు పాల్పడడం వారికి రివాజుగా మారింది. జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ ఆదేశాలతో మార్కెట్‌లో జరుగుతున్న అక్రమాలను అరికట్టేందుకు జిల్లా పౌరసరఫరాల శాఖ, మార్కెటింగ్, తూనికలు కొలతల శాఖ సంయుక్తంగా గత వారంలో మూడు రోజులు ఎసి మార్కెట్‌లో తనిఖీలు చేపట్టాయి. ఈ తనిఖీల్లో వ్యాపారులు చేస్తున్న పలు అక్రమాలు, అవకవతకలు బయటపడ్డాయి.



కూరగాయల మార్కెట్ తనిఖీచేస్తున్న డిఎస్ఓ జ్వాలాప్రకాష్.

సాధారణంగా కొనుగోలుదారులు కోరిన విధంగా పావుకిలో నుంచి ఎంత అడిగితే అంతకు కూరలు అమ్మాలి. ఇది ఎప్పుడూ ఇక్కడ వర్తించదు. ఎవరైనా పావుకేజి అడిగితే వారిని హేళనగా మాట్లాడడం, వారిపై దౌర్జన్యం చేయడం నిత్యకృత్యం. రౌడీల్లాగా ప్రవర్తించే వ్యాపారుల దెబ్బకు విసిగిపోయిన కొనుగోలుదారులు విధిలేక వ్యాపారులు చెప్పినట్లు కొంటుంటారు. అధికారులు చేసిన తనిఖీల్లో ఎలక్ట్రానిక్ కాటాలను వినియోగించకపోవడం దగ్గర్నుంచి, ఏళ్ల తరబడి షాపులకు బాడుగ కట్టకుండా వుండడం, అక్రమంగా అంగళ్లు నిర్వహించడం, రోడ్డు ఆక్రమించుకొని షాపులు ఏర్పాటులాంటి పలు అక్రమాలు బయటపడ్డాయి. మార్కెటింగ్ శాఖ అధికారులు ఇన్నాళ్లుగా అద్దె చెల్లించకపోయినా ఎందుకు మిన్నకుండిపోయారు అనే దానిపై పలు అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి. రాజకీయ అండ, రౌడీమూకల ఆసరా చూసుకొని వ్యాపారులు లెక్కచేయకుండా వ్యవహరిస్తున్నారు. ఈ తనిఖీల్లో అధికారులపైనే వ్యాపారులు తిరగబడిన ఘటనలు వారి రౌడీ ప్రవర్తనను రుజువు చేస్తున్నాయి. తనపై తిరగబడిన మార్కెట్ రౌడీల భరతం పట్టను డిఎస్ఓ జ్వాలాప్రకాష్ నడుం బిగించాల్సి వుంది.

## స్మైల్ దంతవైద్యశాలలో రాయితీలు

### ప్రభుత్వ ఉద్యోగులకు స్పెషల్ ఆఫర్

నెల్లూరు రమేష్‌రెడ్డి నగర్‌లోని స్మైల్ సూపర్ స్పెషాలిటీ దంత వైద్యశాల 11వ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని ప్రభుత్వ ఉద్యోగులు వారి కుటుంబ సభ్యులకయ్యే వైద్య ఖర్చులలో పలు రాయితీలు ఇస్తున్నట్లు వైద్యశాల అధినేత డాక్టర్ కిరణ్ చెప్పారు. 8వ తేది ప్రెస్‌క్లబ్‌లో విలేకరుల సమావేశం ఏర్పాటుచేసి మాట్లాడారు. మహానగరాలకే పరిమితమైన ఆధునిక దంత వైద్యం ఇప్పుడు జిల్లా ప్రజలకు తమ వైద్యశాలలో అతి తక్కువ ఖర్చుతో అందిస్తున్నామన్నారు. ప్రభుత్వ ఉద్యోగులకు స్మైల్ హెల్త్‌కార్డు, ఫ్యామిలీ హెల్త్ కార్డు, ఫ్రీ డెంటల్ చెకప్ కార్డులను అందిస్తున్నట్లు చెప్పారు. ఈ కార్డుతో జీవితకాలం ఉచిత కన్సల్టేషన్ సదుపాయం అందిస్తామన్నారు. ఈ సమావేశంలో స్మైల్ డాక్టర్ల బృందం కవిత, పద్మారెడ్డి, మంజునాథ్ పాల్గొన్నారు.

## చెట్లు పడినా ఎత్తే దిక్కులేదు

నెల్లూరు కార్పొరేషన్‌లో అభివృద్ధి పనులు బ్రహ్మాండంగా జరుగుతున్నాయని ఇటు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, అటు అధికారులు గొప్పలు చెప్పడమేగాని చిన్న చిన్న పనులు కూడా చేయడం లేదనే దానికి రెండు సాదృశ్యాలు ఉదహరించవచ్చు. డిశంబర్ నెల మొదటి వారంలో కురిసిన భారీవర్షాలకు నెల్లూరు రాజరాజేశ్వరమ్మ గుడి వెనుక వీధిలో ఏళ్లనాటి చెట్టు గుడి ప్రహరీపై పడి పోయింది. కానీ నేటికీ దాన్ని తొలగించకపోవడం వల్ల గుడి వెనుక వీధిలో రాకపోకలు కష్టంగా పరిణమించాయి. మూలపేట పోలీస్ క్వార్టర్స్ వద్ద పడిపోయిన గంగిరేను చెట్టును ఈ వారంలో జంట ఎమ్మెల్యేల పర్యటనను పురస్కరించుకొని తొలగించారు. లేకుంటే ఈ చెట్టుకు కూడా రాజరాజేశ్వరమ్మ గుడి వెనుక చెట్టులా మిగిలి పోయేది. వీధుల్లో చెట్టుకొట్టాలన్నా, ఆ వీధుల్లో ఎమ్మెల్యేలు పర్యటించాలా కమిషనర్ గారు!

## దిన దిన గండం

మొదటి పేజీ కొరవ

చేస్తే, ప్రభుత్వం నిలవదు. రాష్ట్రంలో వలె ఢిల్లీలో కూడా మైనార్టీ బలహీనత వేధిస్తున్నది కాంగ్రెస్‌ను. అందువల్లనే తెలంగాణ సమస్య పెద్దది కాకుండా, తెలంగాణ ఎమ్పీలను బుజ్జగిస్తూ కాలం వెళ్లదీస్తు న్నారు.

### రాష్ట్రపతి పాలన?

ఎంతకాలం ఈ కాళ్ల బేరం అన్నది ప్రశ్న. రాష్ట్రంలో రాజకీయ అనిశ్చితస్థితి తొలగించడానికి ఏకైక మార్గం రాష్ట్రపతి పాలన మాత్రమే. కానీ అది కూడా వీలు కావడం లేదు. రాష్ట్రపతి పాలన పెడితే, బడ్జెట్‌ను లోక్‌సభలో ఆమోదింప చేయాలి. అక్కడ కాంగ్రెస్‌కున్న బలం, సమస్యల దృష్ట్యా అది సాధ్యం కాదు. అందువల్ల ఫిబ్రవరిలో శాసనసభ సమావేశాలు జరిపి, బడ్జెట్ ఆమోదింప చేసే వరకు ఎట్లానో కాలం నెట్టుకరావాలి. లేకుంటే ఏప్రెల్ మొదటి తేదీ ఉద్యోగులకు జీతాలు కూడా ఇవ్వ లేరు. రాజ్యాంగ సంక్షోభం తలెత్తుతుంది. అందు వల్ల కనీసం మరొక రెండు నెలలపాటు కిరణ్ కుమార్ రెడ్డి ప్రభుత్వాన్ని ఏదో ఒక రకంగా నిల బెట్టక తప్పదు. కానీ పరిస్థితి చూస్తుంటే దినదిన గండం అన్నట్లుంది. రోజుకొకసారి చచ్చి బ్రతుకుతు న్నది కిరణ్ సర్కారు. దాన్ని రెండు నెలలపాటు ఈడ్చుకొని రాక తప్పదు.

### జగన్ ఏమి చేస్తాడు?

ఈలోగా జగన్ తన ఎమ్మెల్యేలతో రాజీ నామా చేయించి, ప్రభుత్వాన్ని పడగొడితే ఎట్లా అన్నది సమస్య. కానీ జగన్ శిబిరంలో పరిస్థితి చూస్తే ఆ ప్రమాదం కన్పించడం లేదు. దీక్షలకు, ఓదార్పులకు జగన్ వెంట నడవడానికి, ప్రకటన లివ్వడానికి పాతిక ముప్పై మంది వరకు వున్న మాట నిజం. కానీ, ప్రభుత్వాన్ని పడగొట్టడానికి రాజీ నామా చేయమంటే మాత్రం వీరిలో ముప్పాతిక భాగం ముఖం చాటేయడం ఖాయం. మూడేళ్ల పదవీ కాలం వదులుకోవడానికి ఎవరూ సిద్ధంగా లేరు. నిజంగా రాజీనామా తప్పని పరిస్థితే వస్తే, వీరంతా జగన్‌ను వదిలివేయడానికి సిద్ధమని చెప్పు న్నారు. అందువల్ల జగన్ మాటల బెదిరింపులతో కిరణ్ ప్రభుత్వానికి వచ్చే ఇబ్బంది ఏదీ లేదు.

### అసలు సమస్య తెలంగాణమే

కిరణ్ సర్కారుకు నిజమైన ప్రమాదం తెలం గాణ నుంచే వుంది. ప్రణబ్ ముఖర్జీ కోరిక మేరకు బడ్జెట్ సమావేశాల వరకు ఇబ్బంది పెట్టకుండా నిగ్రహం పాటిస్తున్నాడు కెసిఆర్. కానీ ఆ సహనం ఎంతోకాలం నిలవదు. నిరాహార దీక్ష ద్వారా చల్లా రిన ఉద్యమం నిప్పును రాజేయాలన్నది కెసిఆర్ సం కల్పమని చెప్తున్నారు. ఫిబ్రవరి మూడవ వారంలో ఆ పుణ్యం కట్టుకోవచ్చు ఆయన. కిరణ్ సర్కారుకు అంతిమ మరణ శాసనం ఆ దీక్షే అవుతుందన్నది పరిశీలకుల అంచనా.

---

## జనవాణి

2వ పేజీ కొరవ

వాస్తవానికి మన జిల్లా తమిళనాడు రాష్ట్రంలో కలసి వుంటే పారిశ్రామికంగా ఇప్పటికే ఎంతో అభివృద్ధి సాధించేది. ఇప్పుడేమో అటు రాయలసీమ, కోస్తా రాష్ట్రాలలో దేనిలో వుండాలో అర్థంకాని పరిస్థితి నెలకొని వుంది.

షేక్ నాయబ్ నెల్లూరు

## గూడూరు మార్కెట్‌ను అభివృద్ధి చేయండి!

జిల్లాలో గూడూరు పట్టణానికి ఎంతో విశి ష్టత వుంది. పాత రోజుల్లో మైకా ఎగుమతి కేం ద్రంగా బాసిల్లింది. ప్రస్తుతం నిమ్మకాయలను వివిధ రాష్ట్రాలకు ఎగుమతి చేస్తున్నది. అంతే కాకుండా బియిడి కళాశాలలు, ఇంజనీరింగ్ కళాశాలలు కూడా స్థాపించడం జరిగింది. గూడూరు సమీప గ్రామా లైన చింతవరం, చిల్లకూరు పారిశ్రామిక కేంద్రా లుగా అవతరించబోతున్నాయి. పరిసర ప్రాంతాల్లో ఇంత జరుగుతున్నా గూడూరు మార్కెట్ మాత్రం ఎంతకూ మారడం లేదు. ఇప్పటికైనా అధికారులు, ప్రజాప్రతినిధులు తగిన శ్రద్ధ తీసుకొని ఈ మార్కె ట్‌ను అభివృద్ధి పరచ మనవి.

సి.హెచ్.సురేష్‌బాబు గూడూరు



## కావలి పోస్టల్ డబ్బాలు ఏమయ్యాయి?

కావలి వీధులలో వున్న తపాలా పెట్టెలకు రం గులేయాలని నెలన్నర క్రితం వాటిని తీసుకవెళ్లారు. ఇంతవరకు మళ్లీ వాటిని పాత స్థానాలలో పెట్ట లేదు. ఈ విషయమై కావలి మెయిన్ పోస్టాఫీసులో అడిగితే ఈ రోజుల్లో పోస్టు కార్డులు, కవర్లలాంటివి వ్రాసి వేసేవారు ఎవరు అనడం దారుణం. దీని బదులు పనిలేని పోస్టల్‌శాఖనే రద్దు చేసేస్తే పోదా?

కె.సుజాతమ్మ కావలి

## పటేల్ అయితే ఎస్...

మొదటి పేజీ కొరవ

హిస్తున్నాడంటే - కాంగ్రెస్ పెద్దలకు తెలంగాణ ఇచ్చే ఉద్దేశం లేదనే అర్థంలో తీసుకోవాలని పరి శీలకుల సలహా. ఢిల్లీ దొరలకు నిజంగా తెలంగాణ ఇచ్చే ఉద్దేశమే వుంటే, ఈ సమావేశాలు అహ్మద్ పటేల్ ఇంట్లో జరిగి వుండేవి.

## జగనంత కుటుంబం

5వ పేజీ కొరవ

ఢిల్లీ దీక్షలో జగన్ చేసిన బెదిరింపు ఉప న్యాసం కూడా ఆయన పరిణతిలేని తనానికి ఒక రుజువుగా భావిస్తున్నారు. నా దయాదాక్షిణ్యాల మీద రాష్ట్ర ప్రభుత్వం నడుస్తున్నదని, నేను తలచుకొంటే ప్రభుత్వాన్ని కూలగొట్టగలనని, 2014 ఎన్నికలలో నాతో వున్న ఎమ్మెల్యేలంతా నా పార్టీ టిక్కెట్ మీద పోటీ చేస్తారని మాట్లాడాడు జగన్. అంతా "నా" అన్న అహంకారమే. రాజకీయాలలో ఇటువంటి ధోరణులు ఎంతోకాలం మనుగడ సాగించలేవన్నది చరిత్ర చెప్తున్న నిజం.




## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### అందరి చూపు చిరువైపే!

మెగాస్టార్, ప్రజారాజ్యం పార్టీ అధినేత చిరంజీవి వెంకటాచలం స్వర్ణభారత్ ట్రస్ట్‌కు విచ్చేయడంతో అభిమానులు ఆయన్ను చూసేం దుకు ఎగబడ్డారు. అందులోను చిరంజీవి ఇటీవల ప్రత్యేక చికిత్స చేయించుకొని నాజూకుగా తయా రవడంతో సన్నబడ్డ చిరంజీవి గురించే అందరూ చర్చించుకోవడం జరిగింది. కొందరు అభిమానులు, మహిళలు ఇప్పుడు బాగున్నారు సార్ అనడంతో చిరంజీవి నవ్వేశాడు.

### థర్మల్‌పై పోరు

తీరప్రాంత మండలాల్లో ఏర్పాటవుతున్న థర్మల్ విద్యుత్ కేంద్రాల పట్ల జనావళికి జరిగే నష్టాలపై ప్రజాపోరాటం సాగించేందుకు వివిధ రాజకీయ పార్టీలు నడుం బిగించాయి. తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి నాయకత్వంలో సిపిఐ, సిపిఎం, ప్రజారాజ్యం, లోక్‌సత్తా పార్టీల నాయకులు టిడిపి కార్యాల యంలో సమావేశం అయ్యారు. కలసికట్టుగా థర్మల్ పోరు సాగిస్తామన్నారు. 24వ తేదీ గ్రామాల్లో సమా వేశాలు జరుపుతామన్నారు.

### అలరించిన అలీ

సినీ హాస్యనటుడు అలీ తనదైనశైలిలో డైలా గులు చెప్పి సభికులను కడుపుబ్బా నవ్వించారు. స్వర్ణభారత్ ట్రస్ట్‌కు విచ్చేసిన ఆయన చిరుత చిత్రంలోని థాయ్ మసాజ్, రాజేంద్రుడు గజేం ద్రుడు సినిమాలోని ఎంద చాటా అంటూ తనదైన ధోరణిలో డైలాగులు మాట్లాడడంతో చిరంజీవి, వెంకయ్యనాయుడుతోపాటు అందరూ హాయిగా నవ్వేశారు. ఈ సందర్భంగా అలీ వెంకయ్య నాయుడును ఎస్వీ రంగారావుతో పోల్చారు. తానే అంబానీనైతే అన్ని భాషల్లో సినిమాలు తీసి వుండే వాడినని వ్యాఖ్యానించారు.

### రవాణా ఫోర్జరీపై దర్యాప్తు

రవాణాశాఖ కార్యాలయంలో ఉన్నతాధి కారుల సంతకాలు ఫోర్జరీ వ్యవహారంపై హైదరా బాద్ నుంచి అధికారులు దర్యాప్తుకు ఆదేశించారు. దీనిపై ప్రత్యేక దృష్టి పెట్టిన టాస్క్‌ఫోర్స్ అధికారులు ఈ వ్యవహారంలో కంప్యూటర్ విభాగంలో పనిచేసే సిబ్బందిని అదుపులోనికి తీసుకొని విచారిస్తున్నట్లు సమాచారం. లోతైన దర్యాప్తు జరిపితే ఎన్నో అక్ర మాలు, అవకతవకలు బయట పడతాయి.

## నారపరెడ్డి కోదండరామరెడ్డి మరణం

మైపాడు వాసి, బెంగుళూరు నివాసి నారపరెడ్డి కోదండరామరెడ్డి 5వ తేది మరణించారు. కోదండ రామరెడ్డి బహుముఖ ప్రతిభాశాలి. డిగ్రీ చదవడమే గొప్ప అనుకొనే రోజులలో మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేశాడు. జెమ్ గ్రానైట్స్ వంటి ప్రపంచ ప్రసిద్ధ వ్యాపార సంస్థల స్థాపకుడైన జి.వీరమణితో కలసి నలభై ఏళ్లనాడే మద్రాసులో పరిశ్రమలు స్థాపించాడు. మైకా మైన్ నిర్వహించాడు. కాంట్రాక్టర్‌గా గుర్తింపు తెచ్చుకొ న్నాడు. అయినా ఎంతో నిరాబందర జీవితం గడి పాడు. ఇప్పుడు డిఆర్ ఉత్తమ హోటల్ వున్న ప్రదే శంలో ఆయన ఇల్లు వుండేది. నల్లపరెడ్డి చంద్రశేఖర్ రెడ్డి జిల్లా పరిషత్ ఛైర్మన్‌గా ఒక వెలుగు వెలిగింది ఆ ఇంట్లోనే. కోదండరామరెడ్డి సౌమ్యుడు, మృదు భాషి. ఎన్నో ధార్మిక సంస్థలకు గుప్త దానాలు చేశాడు. ఎందరో పేద విద్యార్థులకు విద్యా భిక్ష పెట్టాడు. మాజీ గవర్నర్ పిఎస్ రామమోహన్‌రావు, మాజీ న్యాయమూర్తి ఎస్.దశరథరామరెడ్డి వంటి ఉన్నత స్థానాలలోని వ్యక్తులతో స్నేహం వుండేదా యనకు.

కోదండరామరెడ్డి తనయుడైన విష్ణుస్వరూప్ రెడ్డి హైదరాబాదులో పేరున్న ఇఎన్‌టి డాక్టర్. మరొక కుమారుడు వినోద్‌రెడ్డి సాఫ్ట్‌వేర్ సంస్థలకు అధిపతి. వారి కుటుంబానికి మా సానుభూతి తెలియ జేస్తున్నాము.

## పొల్ట్రీ మల్లయ్య మృతి

తన ఇంటి పేరుతో కాక, వృత్తి పేరుతో సుప్ర సిద్ధుడైన నలబోలు మల్లయ్య నాయుడు 10వ తేది నెల్లూరులో మరణించాడు. నెల్లూరు జిల్లాలో కోళ్ల పెంపకం పరిశ్రమకు ఆద్యుడాయన. అందువల్లనే ఆయన అందరికీ పౌల్ట్రీ మల్లయ్యగానే పరిచితుడు. ఆయన కుమారుడు బలరామ నాయుడు జాతీయ స్థాయిలో పౌల్ట్రీ పరిశ్రమను నియంత్రించే నెక్ సంస్థ కార్యవర్గంలో కీలక స్థానంలో వున్నాడు. మరొక కుమారుడు కామేశ్వరరావు కాంట్రాక్ట్ రం గంలో వృద్ధికి వచ్చాడు. వారి కుటుంబానికి మా సానుభూతి.

# స్వర్ణభారత్ ట్రస్ట్‌లో సంక్రాంతి సంబరాలు

గ్రామీణ ప్రాంత ప్రజలకు విద్య, వైద్యాన్ని అందుబాటులోకి తేవడంతోపాటు మన సంస్కృతి, సాంప్రదాయాలను ప్రతిబింబించే పండుగలను నిర్వహించడంలో వెంకటాచలంలోని స్వర్ణభారత్ ట్రస్టు ఎప్పుడూ ముందుంటుంది. కనుమరుగౌతున్న పండుగలను, వాటిలోని సంస్కృతిని నేటి తరానికి తెలియజెప్పేందుకుగాను స్వర్ణభారత్ ట్రస్టు ఆధ్వర్యంలో బిజెపి జాతీయనాయకుడు ఎం.వెంకయ్యానాయుడు ప్రతి ఏడాది సంక్రాంతి సంబరాల పేరిట వివిధ కార్యక్రమాలను నిర్వహించడం ఆనవాయితి. దీనిలో భాగంగానే జనవరి 11తేది ట్రస్టు ఆవరణలో జరిగిన కార్యక్రమానికి రాజకీయ, సినీరంగ ప్రముఖులు హాజరై సందడి చేశారు. ప్రజారాజ్యంపార్టీ అధినేత చిరంజీవి ప్రప్రధమంగా స్వర్ణభారత్ ట్రస్టుకు రావడంతో కోలాహలం నెలకొంది. వెంకయ్యనాయుడు దగ్గరుండి ట్రస్టులో చేపడుతున్న వివిధ సేవా కార్యక్రమాలను, ఉపాధి రంగంలో నిరుద్యోగులకు ఇస్తున్న శిక్షణ, బాలకార్మిక పాఠశాల, వైద్యశాలలను చిరంజీవికి చూపించి వాటి పనితీరును వివరించడంతో చిరంజీవి ఆశ్చర్యపోయారు.

సంక్రాంతిని పురస్కరించుకొని జిల్లాస్థాయి ముగ్గుల పోటీలను నిర్వహించారు. పలువురు మహిళలు వేసిన ముగ్గులను చిరంజీవి, వెంకయ్యనాయుడు పరిశీలించారు. అనంతరం జరిగిన కార్యక్రమంలో అతిధులందరూ హాజరుకావడంతో వేదిక నిండుతనాన్ని సమకూర్చుకొంది. పండుగల ప్రాముఖ్యతను వివరించిన వెంకయ్యనాయుడు పాశ్చాత్య ప్రభావంతో వాటిని యువత పట్టించుకోకపోవడం పట్ల ఆవేదన చెందారు. రైతులు ఎదుర్కొంటున్న కష్టాలు, నష్టాల పట్ల తీవ్రంగా స్పందించారు. రైతుల విషయంలో ప్రభుత్వాలు వ్యవహరిస్తున్న తీరు సరైనది కాదని, దేశానికి తిండిపెట్టే అన్నదాతల దయనీయస్థితి ప్రభుత్వాలకు చివరకు మీడియాకు పట్టడం లేదని వ్యాఖ్యానించారు. రాజకీయాలకు అతీతంగా రైతాంగ సమస్యలపై పోరాటం చేయాలని పిలుపు నిచ్చారు. స్వశక్తితో సినీరంగంలో ఎంతో ఎత్తుకు ఎదిగిన చిరంజీవి సినీ కళామతల్లికి మూడోకన్నువంటివాడని ప్రశంసించారు.

పాశ్చాత్య ప్రభావంతో పట్టణాలకు, నగరాలకు వలసపోతుండడంతో గ్రామాలు కళతప్పిపోతున్నాయని, పండుగలు కనుమరుగైపోతున్నాయని ముఖ్యఅతిధిగా విచ్చేసిన చిరంజీవి బాధపడ్డారు. సంస్కృతికి పట్టుగొమ్మలైన పండుగలను అందరూ చేసుకోవాలని, మన సాంప్రదాయాలను కాపాడుకోవాలన్నారు. రైతుల పట్ల, వారి సమస్యల పట్ల ముందుండి పోరాడుతామన్నారు. వెంకయ్య నాయుడు గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికి ట్రస్టు ద్వారా చేస్తున్న సేవలను కొనియాడారు.




స్వర్ణభారత్‌లో జరిగిన సంక్రాంతి సంబరాల్లో గజల్ శ్రీనివాస్‌ను సన్మానిస్తున్న వెంకయ్యనాయుడు. ప్రక్కన దీపా వెంకట్, యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, శైలజా కిరణ్, చిరంజీవి, మాగుంట శ్రీనివాసులురెడ్డి.

సినీ హాస్యనటులు రాజేంద్రప్రసాద్, అలీ ట్రస్టు చేపడుతున్న కార్యక్రమాలు పలువురికి ఆదర్శనీయం అని ప్రశంసించారు. విలువలకు కట్టుబడిన వ్యక్తిగా వెంకయ్యానాయుడును అభివర్ణించారు. మార్గదర్శి ఎండి శైలజాకిరణ్ మాట్లాడుతూ అక్షర విద్యాలయానికి తమ సంస్థ తరపున లైబ్రరీని నెలకొల్పుతామన్నారు. విద్యాలయం ఆవరణలో నెలకొల్పిన స్వామి వివేకానంద కాంస్య విగ్రహాన్ని చిరంజీవి ఆవిష్కరించారు. అనంతరం ప్రముఖ గజల్ కళాకారుడు గజల్ శ్రీనివాస్ గ్రామీణ ప్రాంతాలు, రైతుల కష్టాలు తదితర అంశాలను ప్రస్తావిస్తూ పాడిన గజల్స్ ఆహుతుల మనసును కదిలించాయి. ఒక దశలో వెంకయ్యానాయుడు భావోద్వేగానికి గురై కన్నీటి పర్యంతమయ్యారు. అలాగే బాలకార్మికుల కష్టాలను, పాఠశాలలో చేరిన తర్వాత చదువుకోవాలన్న ఆకాంక్షను వ్యక్తం చేస్తూ చెంచమ్మ అనే బాలిక పాడిన పాట చిరంజీవిని ఆకట్టుకొంది. పార్లమెంటు సభ్యుడు మాగుంట శ్రీనివాసులరెడ్డి, జిల్లా కలెక్టర్ రాంగోపాల్, ఎస్పీ దామోదర్, యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, దీపా వెంకట్, మాగంటి రాజేంద్రప్రసాద్ తదితరులు పాల్గొని ప్రసంగించారు. అనంతరం చిరంజీవి, గజల్ శ్రీనివాస్ తదితరులను సన్మానించారు వెంకయ్యానాయుడు.

# సినారె కవిత్వం విశ్వంభరత్వం! జలధి తరంగ, తురంగతత్వం!!

ఆయన ఓ కవిత్వ మహావృక్షం, శాఖోపశాఖలుగా విస్తరించి, విప్లవించి తన బాణీ విపంచిని పల్లవించి పలికించిన విశ్వంభరుడాయన. ఆయన కవిత్వం సామాజిక సమైక్యతాతత్త్వం ఆయన కవిత్వ నాయకుడు సామాన్యుడు – మనిషిని, మనసును, కవిత్వాన్ని వదలి వుండలేనితత్వం, మనస్తత్వం, మూర్తిమత్వం డాక్టర్ సినారె గారిది.

అనంతానంత కాల చక్రభ్రమణంలో 80సంవత్సరాలు ఒక లెక్కకాకపోవచ్చు. రోజుకొక్క కవితా సుమాన్ని కాలానికి బహుమతిగా అందించే ఆయన నేపథ్యం, మనోకాంక్ష, ఆకాంక్ష చాలా గొప్పవి. జూలై 29న ప్రతి ఏటా తన పుట్టిన రోజునాడు కవితామతల్లికి, ఉత్తుంగోత్తుంగ కవితా జాబిల్లికి ఓ సంపుటిని అంకితం యివ్వడం రివాజుగా పెట్టుకొన్న ఆయన అభిరుచి మెచ్చుకోదగ్గది.

'విశ్వం నాలో వున్నప్పుడు' కవితాసంపుటిని ఆయన ఇటీవల వెలుగు రెక్కలు తొడిగి కవితాకాశంలోకి ఎగురవేశారు. ఇందులో మొత్తం 52 కవితా పుష్పకాలున్నాయి.

అవి సినారె భావాంబరవీధిలో విశ్రుతంగా విహరించాయి. ఆ నేపథ్యాలను వివరిస్తూ పాఠకజన సందోహాల్ని కూడా భారతి కృపకు పాత్రుల్ని చేయాలన్నది నా ప్రయత్నం.

"మూసివున్న గదిలో తెరుచుకున్న ఆలోచనల గవాక్షాలు" అంటారు ప్రారంభంలోనే ఎంతటి భావుకత!! మరెంతటి ఆలోచనాలోచనాత్మకత!

మౌనాన్ని తక్కువ అంచనా వేయవద్దని చమత్కారంగా చెబుతారు. 'అక్షర చిత్రాలు' కవితలో –

ప్రతిమౌనం నిస్సహాయతకు నిదర్శనం కాదు కొన్ని మౌనరీతులు–

చైతన్య ఖడ్గాలకు పదును పెట్టుకొనే రహస్యా కేంద్రాలు! అంటారు.

సినారె గారిలాగే ఆయన కవిత్వతత్త్వం కూడా చైతన్య వంతమయింది– అంటారు కదా?

"ఎవరైనా కోరుకోవలసింది చుట్టచుట్టు కొని పడి వుండే జీవితాన్ని కాదు శిరసెత్తి నడిచే జీవన విధానాన్ని!

క్రమ పరిణామాలలో విచిత్రాలెన్నో– దేన్నీ నిర్లక్ష్యం చేయకుండదని ప్రతి విషయాన్ని అంతర్దర్శనం చేయాలన్నది ఆయన సూచన.

**"విశ్వం నాలో వున్నప్పుడు"**

కవి : డాక్టర్ సి.నా.రె
ప్రచురణ : వరేణ్య క్రియేషన్స్
కవితలు : యాభైరెండు – పుటలు : 106
ధర : రూ. 100/-
సమీక్షకులు : పాయసం సుబ్రహ్మణ్య మహర్షి

ప్రతులకు
**వరేణ్య క్రియేషన్స్**
ప్లాట్ నెం.48, రోడ్ నెం.6, ఫిల్మ్‌నగర్ కాలనీ జూబ్లీహిల్స్, హైదరాబాదు – 33. మరియు అన్ని విశాలాంధ్ర, నవోదయ శాఖలు

" ఇది చినుకే కదా అని అనుకోవద్దు ప్రకృతి రచించనున్న వర్షకావ్యానికి ఈ చినుకే తొలి పలుకు" అంటారొక చోట. జీవితాన్ని కాచి వడపోసినతత్త్వం ఆయనది అందుకే–

"కాలమనే మహాగ్రంధాన్ని పుటలు విప్పి చదవగలిగితే అన్ని క్రమ పరిణామాల ఆద్యంతాలు అవగతమవుతాయి" అంటారు ఓ అధ్యాపకుడిలా ఆయన అభిప్రాయాలు నిక్కచ్చిగా వుంటాయి. "ఓడిపోయి జీవించడమంటే బతికున్న నీ శవాన్ని మొసుకపోవడమే" అంటారు నిర్దాక్షిణ్యంగా. డాక్టర్ సినారె కవిత్వం ఉప్పొంగే భావలహరి అది మాటలకందని జీవనవేదం. స్పందనలను బట్టి లయ, తరంగ, ప్రవాహాలుంటాయి. అస్పష్టత, సంక్లిష్టత (నేటి కవిత్వంలో యువతరం ఈ విధమైన గందరగోళాన్ని సృష్టించుకొంటుంది.) కాగడాలు పెట్టి వెతికినా వీరి కవిత్వంలో కనిపించవు. సాహిత్య విమర్శ నేపథ్యంలో వ్యర్థపదాలు, నిరర్థకాలు వలవేసి పడుదామన్నా పడవు. కవిత్వం చెబుతూవుంటే మనతో మాట్లాడినట్లే వుంటుంది. మనకో అంశాన్ని బోధించినట్లే వుంటుంది. మనం దర్జీ కూచోబెట్టుకొని కథ చెప్పినట్లే వుంటుంది. కానైతే కొసమెరుపుల్ని ఉలిక్కిపడకుండా మనం జాగ్రత్తగా వినగలిగి వుండాలి. అప్రమత్తంగా వుండాలి. సినారె నీతి నిజాయితీ వున్న కవి. అవార్డులు, రివార్డులు ఆయన కవిత్వానికి అలంకారాలు మాత్రమే ఆయన ఆశావాది.

"నైరాశ్యంలోంచి ఆశను చేదుకున్నపుడే ఏ మనిషైనా కడవూపిరి దాకా విజయపథంలో వెనుదిరగక సాగిపోతాడు" అంటారు. 'ఏ దుర్ఘటనలైనా' కవితలో మనిషి స్థాణువు కారాదు.

"కూర్చున్నా లేచి నిల్చున్నా మనోవికాసం అనాహతంగా జరిగినప్పుడే ఏ వ్యక్తిత్వమైనా తలెత్తుక తిరగగలుగుతుంది. అది నా విశ్వాసం. అదే నాకు వుచ్ఛ్వాసం, విశ్వాసం" అంటారు. అది నా విశ్వాసం కవితలో– సినారె కవిత్వంలో భావుకత్వం జాస్తి, జడత్వం నాస్తి– చూడండిలా–

"వృక్షాలకు శాఖలే రెక్కలు... అవి కదలినప్పుడల్లా ఆ వృక్షాలే కదలిపోతున్నా చిత్రం కనిపిస్తుంది" అంటారు ప్రతీకలు' కవితలో –ఎంతటి హృద్యమైన భావనో అవలోకించండి.

ఒక ప్రక్క సమాజానికి హితవు చెబుతూనే పచ్చి నిజాల్ని నిక్కచ్చిగా చెబుతారు కొరడా ఝుళిపిస్తూ– ఉద్దేశించినపుడవి ఉద్యమాలే జనం మధ్యలో పదం మోపేసరికి విధ్వంస క్రియలుగా వెర్రితలలు వేస్తున్నాయి! అంటారు 'అపశ్రుతులు' లో...

ఇలా చెప్పుకుంటూపోతే ఆయన కవిత్వాన్ని తడమక స్పృశించక, రుచి చూడక త్వరగా ముందుకు వెళ్లిపోయే విమర్శకుడికి కుదరదు. యాభై రెండు కవిత్వాల్లోనూ రెండువందల ఎన్మిది సందేశాలున్నాయి.

చివరిగా జాతి జనులకు ఆయనిచ్చిన సందేశాన్ని వినిపించి వారిని హృదయపూర్వకంగా అభినందిస్తూ, ఎనభై సంవత్సరాల నేపథ్యంలో శతవసంతాలు వర్ధిల్లమని అభ్యర్థిస్తున్నాను.

"ఆగిపోయినట్టున్నా సాగిపో మూగవోయినట్టున్నా మోగిపో ఒక్క క్షణమైన ముడుచుకపోకుండా ఉప్పెనలా చెలరేగిపో" అంటారు చెలరేగిపో కవితలో–






ఉన్నతమైన వ్యక్తిగా, మహనీయ మనిషిగా, నిరాడంబరమైన జీవిగా కుటుంబ సభ్యులందరికీ తలమానికమైన ఆదర్శమూర్తి శ్రీ నలుబోలు మల్లయ్య నాయుడు గారు తేది 10-01-2011 సోమవారం నాడు స్వర్గస్తులైనారు.

వారి అస్తమయం మా కుటుంబ సభ్యులందరినీ అనంత దుఃఖ సాగరంలో ముంచి వేసింది.

వారి ఆత్మకు శాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

**ఉత్తరక్రియలు**

**తేది 20-01-2011 గురువారం నాడు పెద్దకర్మ.**

నెల్లూరు, పొదలకూరురోడ్డు, నేతాజీనగర్ 8వ వీధిలోని మా స్వగృహమునందు జరుగును.

కావున బంధుమిత్రులకు తెలియజేయడమైనది.

భార్య – నలుబోలు బాలమ్మ



## శ్రీ నలుబోలు మల్లయ్య నాయుడు గారు

జననం 01-08-1935 మరణం 10-01-2011

కుమారులు – కోడళ్ళు

నలుబోలు బలరామయ్యనాయుడు – పద్మావతి

నలుబోలు కామేశ్వరరావు – భారతి

మనుమలు – మనుమరాండ్రు

నలుబోలు మదన్‌మోహన్ – మల్లిక

ఆరి శ్రీలక్ష్మి – లీలామోహన్ (U.S.A)

కొప్పల్లి చందన – రాజశేఖర్

మునిమనుమలు – మనీష్, ఆశ్రిత్

నలుబోలు కౌటిల్య, నలుబోలు కౌముది

తమ్ముడు – మరదలు

నలుబోలు వీరరాఘవయ్య – సుశీలమ్మ

తమ్ముని కుమారుడు – తమ్ముని కోడలు

నలుబోలు వేణుగోపాల్ – అనిత

సాయి కృతిక్, నేహ

తమ్ముని కుమార్తె – తమ్ముని అల్లుడు

గొరినేని విజయ – శ్రీనివాసులు నాయుడు

వెంకట్, నితిన్

---

# ఉత్తరక్రియలు





జననం : 07-07-1932 మరణం : 05-01-2011

పూజ్యులు, మా ఇంటి దైవం

మా పురోభివృద్ధికి ముఖ్యకారకులు, "మిత్రబంధు"

## శ్రీ నారపరెడ్డి కోదండరామరెడ్డి, M.A. గారు

(మైపాడు వాస్తవ్యులు)

తేది 05 జనవరి 2011, బుధవారం ఉదయం

స్వర్గస్థులైనారని తెలియజేయుటకు చింతిస్తున్నాము.

వారి ఆత్మకు శాంతి ప్రసాదించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

**:: ఉత్తరక్రియలు ::**

18 జనవరి 2011 శిలాప్రతిష్ఠ, 19 జనవరి 2011 బుధవారం పెద్దకర్మ

బెంగుళూరు, బి.టి.యమ్. లే-అవుట్‌లోని మా స్వగృహము నందు జరుగును.

శ్రీమతి నారపరెడ్డి సులోచనమ్మ - భార్య

కుమారులు - కోడళ్ళు

డాక్టర్. ఎన్.విష్ణుస్వరూప్‌రెడ్డి
ఇ.ఎన్.టి. & ఫేషియల్ ప్లాస్టిక్ సర్జన్,
కేర్ హాస్పిటల్, బంజారాహిల్స్, హైద్రాబాద్.
- డాక్టర్. శాంతి
ఒబేస్ట్రిషియన్ & గైనకాలజిస్ట్
అపోలో హాస్పిటల్, జూబ్లీహిల్స్, హైద్రాబాద్.

ఎన్.వినోద్‌రెడ్డి
ఛేర్మెన్ & ఎం.డి., సిఆర్‌ఎంఐటి గ్రూప్, బెంగుళూరు.
- శాలిని
డైరెక్టర్, సిఆర్‌ఎంఐటి గ్రూప్, బెంగుళూరు.

కుమార్తెలు - అల్లుళ్ళు

జి.సుప్రియ
- జి.విజయసింహారెడ్డి
డైరెక్టర్, ఫార్చ్యూన్ ఇండియా బిల్డర్స్, బెంగుళూరు.

ఎన్.పద్మప్రియ
- ఎన్.చంద్రారెడ్డి
ఛైర్మెన్ & ఎం.డి., ఫార్చ్యూన్ ఇండియా బిల్డర్స్, బెంగుళూరు.

మనుమలు, మనుమరాండ్రు

జి.అభిషేక్‌రెడ్డి, సిఆర్‌ఎంఐటి (డైరెక్టర్, ఆస్ట్రేలియా)

జి.అనుదీప్, రాహిల్, రుషిల్ సాకేత్, విషాల్, మేఘన, సంజన, వినూష

RSVP: 080 - 26681144, 09845062499 040 - 23547170, 09849398049

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.